# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సాంఘిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 23 మార్చి 1980 సంచిక 3

చిత్రము : — "గోకులం"లో "గోపాలకృష్ణుడు"


| | | |
|---|---|---|
| శ్రీసత్యసాయివాహిని - (15) | భగవాన్ శ్రీ సత్యసాయిబాబా | 49 |
| " శ్రీ సాయిరామ సందేశమకరందము " | | 52 |
| సాయిపథము | డి. వి. కృష్ణరావు | 53 |
| రాజయోగమా ? భక్తియోగమా ? | బాబ్ నజేమి (ఏథెన్స్) | 55 |
| కల్పతరువు | శ్రీవారి దివ్యబోధ | 57 |
| "విద్యా—దదాతి- - -" | సంపాదకుడు | 62 |
| "సాయి సామ్రాజ్యము" | శ్రీవారి దివ్యబోధ | 66 |


గమనిక : 64 పుటలో, రెండవ కాలంలో, రెండవపేరాలో 6వ లైనులో వామన్ బాపూజీ బదులుగా శివరామ్ బాపూజీ కడ్లెకర్ అని చదువుకో ప్రార్థన.

చందాదారులు గమనించండి !

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెలా పంపుచున్న పత్రికపైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆ నెంబరు " /-4-''80 అనియుండిన, మీ చందా ఏప్రియల్ నెలలో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సంగనకు రూ. 6) మార్చి నెల వ 31 తేది 1980 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను

--: శ్రీ వారి కార్యక్రమములు :

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొనగోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్, ప్రశాంతి నిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను లేదా కొత్తచెరువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

సంవత్సర చందా 6 రూ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలయును.
వివరములకు అట్టలోపలి భాగములో చూడండి




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

**15**

పరమోత్కృష్టమైన స్థాయికి చేరుకొనవలెననిన మొదటిది పురుషప్రయత్నము. రెండవది దైవసహాయము అత్యవసరము. ఆత్మజ్ఞానమును ఎవరైననూ ప్రయత్నించి సాధించవచ్చును. స్త్రీలుకాని, పురుషులుకాని, కూటిపేదకాని, ధనవంతుడుకానీ ఎవరైననూ సరే ఈజ్ఞానజ్యోతిని వెలిగించు కొనుటకు అర్హులే. జాతి, మత, కుల, వర్ణవ్యవస్థలతో దీనికి ఎలాంటిసంబంధమూ లేదు. లౌకికవిద్యల నభ్యసించక పోయినప్పటికీ, భౌతికశాస్త్రపరిజ్ఞానం లేకపోయినప్పటికీ ఫర్వాలేదు. ప్రాపంచికమైన చదువులు, సంధ్యలు లేవని విచారించనక్కరలేదు. ప్రస్తుత యుగంలో అట్టి ఆత్మజ్ఞానము సంపాదించటం అంత తేలిక కాదు. అట్లని భావించి, నిరాశ, నిస్పృహలతో ప్రయత్నం మాత్రం విడువరాదు. ఒక్కొక్కపుడు పరమాత్మను తెలుసుకోవాలనే తాపత్రయంలో పడి లౌకికవిద్యలను విడనాడటం జరుగుతుంది. అది మంచిది కాదు.

అటు పరమాత్మను తెలుసుకొనలేక, ఇటు భౌతికవిద్యల నభ్యసించక రెంటికి చెడిన రేవడివలె ఉభయభ్రష్టులవుతుంటారు, కొందరు. అది ఏమాత్రము మంచిదికాదు. భౌతిక విద్యలను కూడ ఏమాత్రమూ నిర్లక్ష్యము చేయరాదు. ఒక చెంప భౌతికశాస్త్రవిజ్ఞానము సంపాదించుతూ ఆధ్యాత్మికదృష్టికూడా కలిగియుండుట మంచిది. ప్రతిదినము కొంతసమయము భగవత్ధ్యానమునకు తప్పనిసరిగా విద్యార్థులు కేటాయించాలి.

కర్మోన్ముఖులై నవభారతనిర్మాణానికి, శక్తివంచన లేకుండా కృషిచేయాలి. అధికారవ్యా

మోహము, బంధుపక్షపాతం, విడనాడాలి. అవినీతిని పారద్రోలి కష్టించిపని చేయాలనే భావం ప్రతివిద్యార్థిలో జనించాలి. భారతదేశభవిష్యత్తు మనమీద ఆధారపడియున్నది. భారతమాత మనకోసం ఎదురుచూస్తూవున్నది. తల్లిని సంతృప్తిపరచటం, సేవించటం, కుమారుల కర్తవ్యం అని నిరంతరం మదిలో చింతించాలి. దేశమాత సౌభాగ్యమును విద్యార్థులు కళ్లారా చూడాలి. ఈ పవిత్ర ఆశయంకోసం మనం జీవించాలి. ఇదే మనధర్మము. దీనినే జాతీయ శీలం అని అందురు. కనుక ప్రతియువకుడు సచ్ఛీలతతోపాటు జాతీయసచ్ఛీలతకూడా కలిగి యుండాలి. శీలరాహిత్యం అత్యంతప్రమాదకర మైనది. సచ్ఛీలము లేనివ్యక్తి తననుతాను ఉద్ధరించుకోలేడు. అట్టివాడు దేశానికి ఏమాత్రము ఉపయోగపడలేడు. తనను తాను త్యాగము చేసుకొని దేశసౌభాగ్యము కోరువారే నిజమైన జాతీయసచ్ఛీలురు. త్యాగముకూడనూ ఒక విధమైన శీలమే! యువకులు అలవరచుకొన వలసిన సద్గుణములలో ఇదికూడా ఒకటి. త్యాగ మనగా, దానముచేయటం, ధర్మము చేయటం అని బావిస్తుంటారు. త్యాగానికీ, దానానికీ యెంతో తేడావుంది. దానము అనగా తనకున్న సంపదలో అంతో యింతో యితరులకు ఇవ్వటం. గోదానం, భూదానం, అన్నదానం, శ్రమదానం, విద్యాదానం, జ్ఞానదానం మొదలగునవి దానం క్రిందకు వస్తాయి.

దానము వేయటంవలన ఏమానవుడూ, ఎప్పుడూ తన సర్వస్వాన్ని కోల్పోడు. దానము చేయకపోవుటచేత జీవుడు దరిద్రుడై జన్మించడు. ఇంకా ఒకమెట్టుపైకిపోయి న్యాయమైన, అవసరమైనంత మాత్రమే ఉంచుకొని మిగతాదంతా దానం చేయటం మరింత ఉత్తమోత్తమ కీర్తిని సమాజములో సంపాదింపవచ్చును. '' దేయం దీనజనాయ చ విత్తం ''. దీనులకు, దరిద్రులకు తనకున్న దానిలో కొంతయిచ్చి, అనగా సాయపడ వలెనని మనశాస్త్రములు చెప్పుచున్నవి. అటుల చేయక స్వార్థంతో, కర్కశంగా, అన్యాయంగా, అక్రమంగా లక్షలుగడించి కోట్లనుపెంచుకొని, దురాశాపరులై పిసినిగొట్టు కారాదు. అట్టిలోభికి యెప్పుడో ఒకప్పుడు అధోగతి దాపురిస్తుంది. అది తప్పునదికాదు. అన్యాయార్జిత అన్నము, ప్రజల రక్తపుటన్నము. కాన అట్టి అన్యాయార్జితజీవితానికి యువకులు బానిసలు కారాదు. ఇట్టి స్వార్థపు జీవితాన్ని భగవంతుడుకూడా క్షమించడు. ఇతరులకు ఇవ్వక, తానుతినక యావత్సంపదను కూడబెట్టి మరణించువాడు దుర్గతి పొందుతాడు. అట్టివారి సంతతికూడా మున్ముందు అధోగతిని అనుభవించును.

అట్టి డబ్బుకు నలుగురు వారసులు కలరు. మొదటివాడు ధర్మము. రెండవవాడు రాజు, అనగా ప్రభుత్వము. మూడవవాడు అగ్ని, నాలుగవ వాడు దొంగ. ఇందులో పెద్దవారసుడు ధర్మము. పెద్దవారసునికే పెద్దవాటా రావలసి యుండును. దీనిని గుర్తించిన వ్యక్తికావాలి విద్యార్థి.

ఈ నలుగురి వారసులపై అత్యున్నతమైన మెట్టు త్యాగం. ఇది సర్వోత్కృష్టమైన అమిత ప్రియమైన వస్తువులను సహితం, నవ్వుతూ, నవ్వుతూ, మనసున ఎట్టిసంకోచముకూడా లేక ఇతరులకు ఇవ్వగలిగినవాడు నిజమైన

త్యాగి. కర్మఫలమును ఈశ్వరార్పణగా వదలుటయే త్యాగం. భౌతికశరీరమును సహితము తృణప్రాయముగానెంచి త్యజించటానికి సిద్ధమౌతాడు త్యాగి. త్యాగమన భౌతికధన కనక వస్తు వాహనాదులు వదలుటయేకాక, మనలో జన్మజన్మలుగా కరడుగట్టుకొని నిలిచి పోయిన దుర్గుణములు అనగా ద్వేష, అసూయ, క్రోధ, క్రూరత్వస్వార్థములను విసర్జించ వలెను. దుర్గుణవిసర్జనే నిజమైనత్యాగము. లోకకల్యాణమునకు, సమాజాభివృద్ధికి సర్వభూతముల సుక్షేమమునకు, తనదేహమునైననూ త్యజించుటకు, మృత్యువునకుకూడా భయపడక జీవిత సర్వస్వాన్ని సమర్పించుటయే నిజమైన త్యాగం. త్యాగమునకు మించిన సుఖము మరొక్కటి లేదు. అట్టివాడే అమృతపుత్రుడు. అతడే చిరంజీవి.

మన ప్రాచీనపురాణ, ఇతిహాసములను పరిశీలిస్తే అట్టి త్యాగశీలురు కోకొల్లలుగా కనిపిస్తారు. శిబిచక్రవర్తి, బలిచక్రవర్తి, దధీచి, కర్ణుడు మొదలైన త్యాగశీలురు ఎందరో ఉన్నారు. అట్టి త్యాగశీలురు ఏకొందరైననూ నేటి విద్యార్థులలో, రాజకీయనాయకులలో ఈనాడు లోకానికి అత్యవసరము. స్వార్థాన్ని విస్మరించి, అహంకారాన్ని అణగద్రొక్కి, పదవీవ్యామోహములను పారద్రోలి, సంకుచితభావాలను సమయజేసి సమాజక్షేమమునకు, ధర్మస్థాపనకు, న్యాయపాలనకు కంకణము కట్టుకోవాలి. దురదృష్టవశాత్తు రాను రాను శబ్దాలకు అర్థాలు మారిపోతున్నాయి. త్యాగం, న్యాయం, ధర్మం, సేవ ఒక వ్యాపారంగా మారిపోతున్నాయి. స్వార్థం విద్యార్థులలోను, రాజకీయనాయకులలోను, విద్యాధికారులలోను విలయతాండవం చేస్తున్నాయి. అధికారవ్యామోహం, పదవీకాంక్ష, పెచ్చు పెరిగి పోయినవి. ఒకప్పుడు త్యాగభూమిగా, కర్మభూమిగా, తపోభూమిగా పేరుపొందిన భారతభూమి భోగభూమిగా మారి పోవుచున్నది. అందువలననే దేశమునకిన్నిరోగములు బయలు దేరినవి.

ఈవిధానం మారాలి. చరిత్ర పునరావృతం కావాలి. త్యాగశీలురు మీలో వేలకువేలు ఆవిర్భవించాలి. ప్రతిభారతీయయువకుడు తిరిగీ త్యాగమూర్తిగామారాలి. భోగములకంటె త్యాగమే ఎక్కువ మధురమైనది. త్యాగమే జీవిత పరమావధి కావాలి. 'త్యాగాత్ శాంతిః' త్యాగము వలననే శాంతి చేకూరగలదు. మనస్సుకు శాంతి లేకపోతే దుఃఖాలు మనలను వదలవు. శాశ్వతంగా మనలోనే కాపురం చేస్తాయి. ఆత్మశాంతి లేనివానికి ఎంతసంపద వున్ననూ ప్రయోజనం శూన్యమే. కర్మఫలమును నిష్కామబుద్ధితో త్యజించటమే త్యాగము. అట్టిత్యాగమే చిత్తశుద్ధి. చిత్తశుద్ధియే శాంతిని చేకూర్చును. అందువలననే "త్యాగేనైకే అమృతత్వమానశుః" అని ఉపనిషత్తులు ఎలుగెత్తిచాటినవి. త్యాగమే శిష్టుల ప్రధానలక్షణము. కనుక ప్రతివిద్యార్థి తనజీవితాన్ని త్యాగమయజీవితంగా మార్చుకోవాలి. భోగమనే రోగానికి గురికారాదు. దురదృష్టవశాత్తు ఈనాడు విద్య ఉద్యోగమునకుగానీ జ్ఞానాభివృద్ధికి కాదన్నవాదము స్వేచ్ఛగా సంచరించుచున్నది. ఇది చాలా విచారకరం. జ్ఞానమనగా ప్రకాశం, క్రాంతి, వెలుగు అని అర్థము. దానిని ప్రసాదించునదే విద్య. అట్టిజ్ఞానమే మానవునకు నిజమైన శక్తి. ఒక్కొక్క వస్తువు

యొక్క పూర్వాపరములను తెలుసుకొనుటయే జ్ఞానము. వ్యక్తిసంబంధమును గుర్తించుటయే జ్ఞానము. అసలు మనిషిలో క్రాంతి, ప్రకాశం వెలుగు ఎలావస్తుంది? వేద, వేదాంగములు, ఉపనిషత్తులు, ఖురాన్, బైబుల్, గ్రంథరాజు ఇత్యాది ఉద్గ్రంథములు, మహనీయుల చరిత్రలు, భౌతికవిజ్ఞానసాంకేతికశాస్త్రములు, మానసికశాస్త్రములు, మొదలగు ఎన్నియో ముఖ్యమైన గ్రంథములు వినుటవలన, పఠించుటవలన, ఈ జ్ఞానం మనిషిలో కలుగుతుంది. వివేకముతో విచక్షణాయుతంగా ఆలోచించే శక్తి కొంతవరకు ఉద్భవించును. కేవలము శాస్త్రజ్ఞానమునే ఆధారము చేసుకోరాదు. అనుభవజ్ఞానమును మూలాధారం చేసుకోవాలి.

విద్యావిధానపు రూపురేఖలు మారాలి. స్టాక్‌హోం విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా పని చేయుచుండిన ప్రొఫెసర్ గున్నార్ మార్థాల్ ఒక పర్యాయము అనగా 1972లో ఢిల్లీవచ్చినపుడు చెప్పినది, ఒకతూరి భారతీయ విద్యార్థులు సింహావలోకనము చేయవలెను. "భారతదేశవిద్యావిధానము అభివృద్ధికి వ్యతిరేకమైనది. నీవు నీచేతులు మట్టి చేసుకోవద్దు అనే మనస్తత్వాన్ని అది పెంచుచున్నది-" అని అన్నారు.

అనగా ఈనాడు విద్యార్థులు శ్రమలేక, చెమటోర్చక, ధరించిన ఇస్త్రీవస్త్రం మడతలు కదలక కరెంటు పంకాలక్రింద కాళ్లు చాపుకొని లేదా ఎయిర్ కండిషన్‌లో పండుకొని పనులు చేయాలని ఆశిస్తున్నారు. ఇది విద్యయొక్క విధేయత కాదు. వినయము అంతకంటెకాదు. విద్యార్థులు శ్రమించాలి. తాము నేర్చిన పవిత్రభావాలను, విషయాలను సమాజానికి చాటాలి. సేవలు చేయాలి. పల్లెలలో పులిపిల్లలవలె దుమికి అన్నివిధములైన మాలిన్యములను పరిశుద్ధముగావించాలి. నిరక్షరాస్యులైన పల్లెజనులకు జ్ఞానబోధ చేయాలి. వారితోపాటు శ్రమించి పనిచేసి వారిని ముందుకు తీసుకురావాలి.

(సశేషము.)

## "సాయిరామ సందేశమకరందము"

ఆ॥ వె॥ శ్రీకరమ్ము సకలలోక కల్యాణమ్ము
నిత్యనూతనమ్ము నిర్గుణమ్ము
నాదమోది తమ్ము నీదివ్యనామమ్ము
సాయిరామ ! దివ్యశాంతిధామ॥

ఆ॥ వె॥ పుట్టపర్తివాన ! పూర్ణేందునిభహాస!
చిద్విలాస ! యాశ ! చిత్ప్రకాశ !
గుట్టు దెలిపి ప్రోచునట్టి సద్గురుడవు
సాయిరామ ! దివ్యశాంతిధామ॥

# సాయిపథము

పరమాత్మ ఆదిమధ్యాంతరహితుడు. సృష్టిస్థితి లయములు ప్రకృతిశక్తియొక్క వ్యక్తావ్యక్త పరిణామములు. ఇవి పరమేశ్వరుని సంకల్పమాత్రమున జరుగుచున్నచర్యలు. "పరమాత్మయే తనశక్తి మహిమవలన జగత్స్వరూపముగ పరిణమించును. ఈ పరిణామము మాయదేకాని అందుగల ప్రతిబింబమైన ఈశ్వరునిదికాదు. మాయావిజృంభణమువలన ఆత్మయే జగదాకారముగ నామరూపములతోభాసిల్లును. మాయయొక్క రజస్తమోగుణములు చలింపనిస్థితిని అవ్యక్తమని అందురు" అని సత్యసాయివాహినిలో బాబా వ్రాసిరి. ఇట్టి పరిణామములు ఇప్పటికి అనేకములు జరిగినట్లును మరియు జరుగనున్నట్లును వేదములలోని కొన్ని ప్రార్థనలవలన వ్యక్తమగుచున్నవి. ప్రకృతి సర్వేశ్వరుని ఆశ్రయించుకొనియున్న ఒక మహాశక్తిగా చెప్పబడుచున్నది. త్రిగుణాత్మకమును (సత్వరజస్తమోగుణములచేగూడినది) శక్తిస్వరూపమునగు ఈ ప్రకృతియే 'మాయ' 'మిథ్య' అని తత్త్వవేత్తలచే తెలుపబడినది. భగవానుడు మాయాధీశుడు. మాయ ఆయనయొక్క శక్తిస్వరూపము. ఈకారణమున ఆత్మశక్తియగు ప్రకృతియు పరమాత్మవలె అనాది. దాని పరిణామములుకూడ అనాద్యములే.

వేదములను శబ్దబ్రహ్మముగా శాస్త్రములు వివరించినవి. ప్రతిసృష్టికార్యముతోపాటు వేదవిజ్ఞానము కూడను దైవాంశసంభూతులగు కొందరు మహర్షుల ముఖతః ప్రకటితమగుచువచ్చినది. వేదములు ఈశ్వరప్రేరితములుగా వెలువడినవి గనుక అపౌరుషేయములని చెప్పబడినవి. "సత్యం జ్ఞానమనంతంబ్రహ్మ" అట్టి బ్రహ్మజ్ఞానమే వేదసారము. అందువలన పరబ్రహ్మమువలె వేదములు (వేదవిజ్ఞానము) కూడను అనాది. వేదవిజ్ఞానమునుండి జగన్నాథుడు జగత్తును సృష్టించెనని శ్రీశంకరులు నుడివిరి. "యోవేదేభ్యః అఖిలం జగత్ నిర్మమే" గీతాజ్ఞానమును ఆశ్రయించుకొనియే ముల్లోకములను పాలించుచున్నానని శ్రీకృష్ణుడు ఉద్ఘాటించెను. "గీతాజ్ఞానముపాశ్రిత్యత్రీన్లోకాన్ పాలయామ్యహం" వేదసారమే గీతాజ్ఞానము. ఈ విధముగ బ్రహ్మము, ప్రకృతి, వేదజ్ఞానమను మూడును అనాదియని విశదముకాగలదు. యథార్థముగ ఈమూడును ప్రత్యేకముగలేవు. అవి ఒకేఒక మూల సత్యముయొక్క భిన్నరూపములని చెప్పనగును. ఉన్నది ఒకటిమాత్రమే. కాని మాయావృతమైన మానవమనస్సుకు అది అనేకముగా కనబడుచున్నది.

"ఏకోహం బహుస్యాం" దృశ్యము సృష్టికర్తయొక్కఉనికికి, చిచ్ఛక్తికి ఆనందస్ఫూర్తికి ఒక దృగ్గోచరమైన నిదర్శనము. పరమాత్మను సచ్చిదానందస్వరూపముగ శాస్త్రములు వర్ణించినవి. దృశ్యము పరమాత్మయొక్క వ్యక్తస్వరూపము.

వేదములు విజ్ఞానసర్వస్వములు. వీనిలో మానవాళిసముద్ధరణమునకు ప్రతిపాదింపబడని సంక్షేమ సిద్ధాంతములుగాని, సూక్తులుగాని ఏకాలమునను, ఏ దేశమునను మనకు గానరావు. సర్వమానవులకు అభిలషణీయమైన చతుర్విధపురుషార్థ (ధర్మార్థకామమోక్షములు) ప్రాప్తికి వేదములు వివిధమగు దివ్యమైన, భవ్య

మైనమార్గములను సూచించినవి. అత్యంత ఆధునికమని మనము భావించు వైజ్ఞానికశాస్త్రములు (sciences) అన్నియు వేదములలో వివరింపబడియున్నవని వేద విజ్ఞానఖనులగు మహాత్ములు తెలియజేయుచున్నారు. వేదవేత్తలగు ప్రాచీనమహర్షులు అనేకములగు కఠోర ఆధ్యాత్మికసాధనలు సలిపి తద్వారా సాధించిన తమ దివ్యశక్తులచే ప్రకృతిశక్తులను మంత్రయుక్తముగా స్వాధీనపరచుకొనిరి. అట్టిశక్తులను వారు లోకకళ్యాణముకొఱకు మాత్రమే వినియోగించిరి. స్వార్థపర చింతనకు, వ్యక్తిప్రతిష్ఠలకు వారు ఏమాత్రము చోటివ్వలేదు. అయితే ఆధునికశాస్త్రజ్ఞులు ఆత్మవిచారణయు, తత్త్వచింతనయులేని తమ బుద్ధి కౌశలమును మాత్రము ఆధారముజేసికొని భౌతికశక్తులను యంత్రయుక్తముగా లోబఱచుకొనుచున్నారు. కాని ఆవిధముగ వశపడిన శక్తులు ధర్మజిజ్ఞాసయు, బ్రహ్మజిజ్ఞాసయు లోపించిన శుద్ధలౌకికభోగవిలాసములకు తోడ్పడుచు ఒక్కొక్కప్పుడు స్వార్థపరత్వము, అసూయ, అహంకారాది దుశ్చింతలకు దోహదపడి ఆత్మవినాశనమునకు దారితీయుచున్నవి. మానవహృదయమును దివ్యగుణతేజోవంతముగను ప్రేమభరితముగను జేసి తద్వారా విశ్వశ్రేయస్సుకు ఆనాటి మంత్రము ఉపకరించినది. కాని అట్టిహృదయమును పాషాణసదృశముగను, కర్కశముగను మార్చి రాక్షస ప్రవృత్తికి అవకాశము కల్పించుచున్నది. ఈనాటి యంత్రము. ఆత్మవిచారణాశూన్యమైన కేవలయాంత్రిక విన్యాసము దానవకృత్యమువలె దుఃఖాంతముగ పరిణమించునేగాని మానవాభ్యుదయమునకు సహాయకారికానేరదు. ప్రాచీన మహర్షులు మంత్రద్రష్టలు. చైతన్యవంతమగు మంత్రము ఆనాటి మానవులకు కాంతిని శాంతిని ప్రసాదించినది. జడభూతమైన యంత్రమే పరమావధిగా భావించిన ఈనాటిమానవులకు అశాంతియు, కామక్రోధాదిరూపరాక్షససంచారమునకు అనువైన అంధకారమును లభించుచున్నవి. "భౌతికశక్తులను నడిపించగలది స్వశక్తి. అదియే ఆత్మశక్తి" అని బాబా అన్నారు. పురాణేతిహాసములలో వర్ణింపబడిన రాక్షసమాయలు, కుయుక్తులు మఱి ఇతరభౌతికశక్తులు ధర్మచింతనలేని స్వార్థపరమైనవ్యక్తిఘనతను ప్రదర్శించుకొనుటకు మాత్రమే ఉపయోగపడినవి. అంతియేగాని ఆత్మోన్నత్యమును చాటుటకు వినియోగపడలేదు. మానవసంబంధమగు ఏపనియైనను పరమాత్మకు యథోచితరీతిని అంకితము గావలెను. అనగా అట్టి కర్మధర్మచింతనతోకూడిన బ్రహ్మచింతనకు దోహదకారిగావలెనని భావము. "ఆధ్యాత్మికవికాసములేని జీవతత్త్వము పశుత్వముతో సమానము" అని బాబా తెలిపిరి. ఇప్పటి వైజ్ఞానికయుగమున పైశాచికప్రవృత్తులే బహుళవ్యాప్తిని బొంది వీరవిహారము సలుపుచున్నవి. దీనికి కారణమేమి? అనిత్యము అసత్యమునగు భౌతికవస్తుజాలముపై మానవులు మితిమీరిన మమకారమును పెంచుకొని వినాశశీలియగు వస్తుసంపదకు అనుచితమైన విలువను ఆపాదించుకొనుచున్నారు. ఈవిధమగు దృశ్యవ్యామోహముతో మానవుడు తనసహజవిలువను (ఆత్మశక్తిని) కోల్పోయినాడు. "వస్తువుల విలువలు పెరుగుటకు కారణము మానవుని విలువ తగ్గుటయే" అని బాబా అనిరి. సత్యప్రపూర్ణమగు మానవాభ్యుదయమునకు వేదవిహితకర్మలు, సూత్రులు మాత్రమే సార్థకమైన మార్గమును సూచింపగలవు.

వి. కృష్ణరావు.
హైదరాబాద్

# రాజయోగమా? భక్తియోగమా?

నేను దాదాపు తొమ్మిది సంవత్సరాలు రాజయోగం అభ్యసించాను. అంతేకాక ఐదు సంవత్సరములు హఠయోగం బోధించాను. దానివల్ల నేను సాయి మీద భక్తిప్రపత్తులు పెంచుకోవడానికి ముందు మానసిక సంఘర్షణకూ, అయోమయస్థితికీ లోనయ్యాను.

రాజయోగం భౌతికశక్తినీ, ప్రాణాన్నీ భావనారూప, మయిన మానసిక రీతులన్నిటినీ అదుపులో పెట్టుకొని, క్రియాశక్తిని పెంపొందించడానికి తోడ్పడ్తుంది. ఈరకంగా సాధించినస్వశక్తికీ, భగవంతుని యెడల శరణాగతి లేక ప్రపత్తిభావానికి నడుమ కొంత సంఘర్షణ సహజముగా తలెత్తుతుంది.

రాజయోగమార్గం చురుకుదనం సూచించేదయితే భక్తిమార్గం మందకొడిమార్గంగా కన్పడ్తుంది. భక్తిమార్గంలో పయనించడం వేరెవ్వరిపైననో (మోక్షం విషయంలో దైవంపైన) తనపనికోసం ఆధారపడి నట్లగుపడ్తుంది. తన దివ్యానుగ్రహంద్వారా ఇట్టి మానసికసంఘర్షణను బాబావారు తొలగించడమేకాక, నాకు రాజయోగ, భక్తియోగమార్గాలను సమరసం చేసే విధానం గురించి తెలియచేశారు.

దైవం వేరే ఎక్కడో లేడనీ, వేరెవ్వరోకాదనీ, తనలోని నిత్య సత్యమైన అంతరాత్మయేననేది మొట్ట మొదటి సూక్తి. అందువల్ల భగవదిచ్ఛకి కట్టువడడం (ఈశ్వర-ప్రాణిధనం) అన్నా తన అంతరాత్మప్రబోధానికి లోబడి నడుచుకోవడమన్నా ఒక్కటే. అహంభావంతో కూడిన కోర్కెలను. అంతరాత్మకు సమర్పించాలి. అయితే మనలో చాలామందికి అంతరాత్మను గుర్తించే శక్తిలేదు కనుక దానిని మనలోని ఈశ్వరత్వంలో మూర్తీభవించేట్లు చేసుకోవాలి. ఈ మూర్తి బాబావారిది కావచ్చు, శ్రీకృష్ణుడిది కావచ్చు, ఏసుది కావచ్చు. ఇట్లాచేయడం వల్ల మనం పరమాత్మ యిచ్ఛకు వశులవుతున్నామన్నమాట.

రాజయోగంమీద అధికారగ్రంథమైన "యోగ సూత్రాల"లో, పతంజలి యోగమార్గానికి సంబంధించిన మూడు మౌలికసూత్రాలద్వారా "ఈశ్వర ప్రాణిధనం" గురించి ప్రస్తావించారు. ఈపద్ధతి స్వయం పోషకమై, ఆధ్యాత్మిక సాధనలో సమాధిస్థితిని చేరడాన్కి భగవంతునిలో విలీనం కావడాన్కి ఒక మార్గంగా తెలుపబడింది. (పతంజలి I 23, II 1, II 32.)

మోక్షాన్ని పొందడాన్కి పతంజలి వివరణానుసారం కావల్సిన ఆత్మనిగ్రహం సాధించడం ఈకలియుగంలో అసాధ్యం. తనస్వశక్తి ద్వారా అట్టి ఉపేక్షని, విచక్షణాజ్ఞానాన్నీ పొందడాన్కి ఈనాటి పరిస్థితులు అనుకూలంగాలేవు. అంతేకాక సర్వస్వశరణాగతి మనోభావము, వినయవిధేయతలు లేనిదే హఠయోగ, రాజయోగ మార్గాలు మనిషిని దురహంకారిగా మార్చే అవకాశం ఉన్నది. ఈయోగమార్గాలు తనేదో సాధించానన్న "గర్వాన్ని" మనిషిలో రేకెత్తిస్తాయి. ఇతరులకంటే తాను గొప్పవాడిననే గర్వాన్ని మనిషిలో కల్గిస్తాయి. ఆధాత్మిక సాధనలో పురోభివృద్ధికీ, మానవసామరస్యమునకూ ఇంతకంటే వినాశహేతువు మరొక్కటి ఉండదు.

ప్రస్తుత మానవపరిణామదశలో మనప్రయత్నాలు సఫలం కావాలంటే ఈశ్వరుడే తనసహాయం అనుగ్రహించాలి. శ్రీఅరవిందులు తమ శిష్యులొకరికి వ్రాసిన జాబులో "తన స్వశక్తిద్వారాను, ఆత్మ సంకల్పం ద్వారాను విషయవాంఛలవంటి అధోగతికి సంబంధించిన శక్తులపై విజయం సాధించగల ధీరత్వం కలవారు ఈనాడు చాలా అరుదు. అట్లాంటి శక్తిగలవారిలోకూడా పూర్తి నిగ్రహం సాధించడం అసాధ్యం. ఆత్మబలం, దృఢసంకల్పం దైవబలాన్ని మానవునికందజేసి తద్వారా విషయవాంఛలనరికట్టడాన్కి తోడ్పడతాయి. హృదయాంతరంగంలో నిగూఢమైన మానసికసంకల్పానికి దైవశక్తి తోడ్పడినపుడుమాత్రమే మనస్సుయొక్క ఇచ్ఛను విజయవంతంగా నెరవేర్చుకొన గల్గుతాం" అని తెలియజేశారు.

ఒక భక్తుడు సాధనద్వారా పొందే ఆధ్యా ప్రగతిలో దైవానుగ్రహం చేసేపని ఏమిటని స్వామిని ప్రశ్నించాడు. దానికి భగవాన్ జవాబిస్తూ "నీ అంతరాత్మనుండివచ్చే దివ్యానుగ్రహమే మౌలికమైన, ముఖ్యమైన సహాయం. నేను అనంతమైన దివ్యానుగ్రహాన్ని నీకు ప్రసాదించవచ్చు. కానీ నీ హృదయం మాలిన్యపూరితమై, నీ మనస్సు అహంకారభరితమైనప్పుడు ఆ అనుగ్రహం ఏ పనిజేయజాలదు. నీ హృదయాన్ని ప్రేమతో పరిశుద్ధంగావించు. తోటి సోదరమానవాళికి సేవచేసి తద్వారా అహంకారాన్ని తొలగించు" అని విప్పి చెప్పారు. అంతేకాక ఇంకాఇలాఅన్నారు. "భగవదనుగ్రహాన్ని సూర్యరశ్మితోను, వానజల్లుతోను పోల్చవచ్చు. నీరు కావాలంటే ఒక కుండను వానలో పెట్టి నీరు నింపుకొనడమనేసాధన చేయాలి. సూర్యుడు ప్రసాదించే వెలుగు కావాలంటే నీకిటికీ తలుపులను తీసి నీగదిలోని అంధకారాన్ని పారద్రోలాలి. అట్లే నీ హృదయ కవాటాన్ని తెరచి భగవదనుగ్రహం అనే సూర్యరశ్మిని ప్రవేశింపచేయి. మన రేడియోను మనం కట్టివేసినప్పటికీ రేడియోకేంద్రాలు ప్రసారంచేసే సంగీతపు ధ్వనితరంగాలు మన చుట్టుప్రక్కల ఉంటూనేఉంటాయి. మనం రేడియోమీటనొక్కి సరయిన రేడియోకేంద్రాన్ని గుర్తించగల్గినపుడు ఆసంగీతం విని ఆనందించగల్గుతాం. ఆదేరీతిన దైవానుగ్రహం కోసం ప్రార్థించడం అనే సూక్ష్మమైన సాధనను చేయాలి. ఆదైవానుగ్రహమే అన్నిటినీ సానుకూలపరుస్తుంది. ఇట్లా చేకూరిన సాధనాఫలితం మందకొడిగా పొందుతున్నామని మనకనిపించినా పట్టు విడవకుండా సాధించాలి. అన్నిరకాల కోర్కెలను నెరవేర్చడం దైవానికి స్వాభావికం.

ఆ రకంగా ఈజీవి స్వశక్తితో యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యానాదులను అభ్యసిస్తూ, స్వలాభాపేక్షను, దేహవాంఛలనూ అణచుకొని, చేసిన కర్మల ఫలితాలను దైవానికర్పించడం యొక్క విలువతెల్సుకోగల్గెను. ఈ సాధన ప్రతిదినం క్రమం తప్పకుండా వీలయినంతసేపు ప్రతి పనిలో దైవధ్యానం జోడిస్తూ చేయడం జర్గుతున్నది.

భోజనంకానీ, నిద్రకానీ, మరేపనికానీ భగవదర్పితం చేసి, దానిని సాధనగా మార్చుకోవచ్చు. ఉదాహరణకు ప్రతిఉదయంకానీ, సాయంకాలంకానీ, సమయం చిక్కినప్పుడల్లా ఈక్రింది ప్రార్థనను జపించ వచ్చు.

ఓ భగవన్! అప్రత్యక్ష సత్యమే
సాయి అవతారం దాల్చి ప్రత్యక్షమైన అవతారమా!
అంగీకరించు. దయతో నాతపస్సునూ, కర్మలనూ,
ఈ ప్రయత్నాల ద్వారా—
నీ అనుగ్రహం ద్వారా—

ఈవాక్కూ, ఈవాహికలూ
నాకర్మలూ క్షాళణం కావించబడ్డాయి,
ఈ ఆనకట్టలాంటి
అహంకారం తొలంగిపోయి
ఈ జీవితం అనేనదీప్రవాహాన్ని
చేరనీ నీప్రేమసముద్రాన్ని
అనుగ్రహించు నన్ను నీపనిముట్టుగా
నీ దివ్యశక్తి కణకణానికీ పట్టుగా!
ప్రతిఆలోచనా పలుకూ పనీ ధర్మానికనుగుణంగా
ఉండాలి స్వామీ! అదేపణంగా.

ఒక వైపున యోగాభ్యాసంద్వారా స్వయంకృషి గావిస్తూ దానిని భగవదిచ్ఛకర్పించి, మరోవంక దైవాన్ని శరణాగతి తత్త్వంలో చేరవచ్చని ఈ విధంగా తెలుసుకున్నాను.

"ఎవరు స్వయంకృషితో పైకి రావడానికి ప్రయత్నిస్తారో వారికి భగవంతుడుకూడా సహాయపడ్తాడు".

బాబ్ నజేమి- -అర్థన్

# కల్పతరువు

కామితార్థంబులెల్లను — కల్పతరువు
వలెను దయచేయు దేవుండు — కలడొకండు
దుర్లభంబగు నరజన్మ — దొఱకుకతన
అతని చేరుటే పరమల — క్ష్యంబుమీకు!

బాలబాలికలారా! భావిభారతపౌరులారా! భరతమాత మీకోసమై పరీక్షించుచున్నది. భరతమాత కలువరేకులవంటి కన్నులద్వారా కార్చుచున్న కన్నీటి ధారలు మీకు కనిపించుటలేదా? ఆమె విలాపం మీరు వినుట లేదా? బాలబాలికలారా! కన్నులు తెరచి, ఆ విలాపమునకు కారణమేమిటో, కన్నీటి ధారలు కార్చుటకు కారణమేమిటో గుర్తించడానికి ప్రయత్నించండి. ఎందుకోసం, ఎవరికోసం ఈ కంటిధారలు కార్చుచున్నది?

తన బిడ్డలైన భారతీయులు ఒకరితోనొకరు కలహించుట చూచి కన్నీటిధారలు కార్చుచున్నది భరతమాత. ఒకరి ఉన్నతినిచూచి మరొకరు అసూయ పడటంచేత విలపించుచున్నది భరతమాత. తమ ముద్దుబిడ్డలైన భారతీయులు స్వార్థమునకు, అహంకారమునకు, సంకుచితభావములకు స్థానమిచ్చి చెడిపోవుచున్న పరిస్థితినిచూచి కన్నీరు కార్చుచున్నది భరతమాత. దురదృష్టవశాత్తు కొందరు స్వార్థపరులు కులతత్త్వములగూర్చి కుస్తీలు పట్టుచున్నారు. మతవర్గాలచేత మారణాస్త్రములను ప్రయోగించుచున్నారు. స్వార్థము, సంకుచితభావములు మిన్నంటుచున్నవి. శీలరాహిత్యము చిటికొమ్మను చేరుచున్నది. క్రమశిక్షణ కంటికే కనిపించటంలేదు. అనైక్యత అనే బంధములచేత భరతమాత హస్తములు బంధింపబడినవి. ఈ విషసర్పముల బారినుండి భరతమాతను తప్పించు మహావీరులు మీరే! కారణమును గురించి వరించి

భరతమాత కంటిధారలు తుడుచువారు మీరే! కానీ, దేశముయొక్క ఉన్నతిని, సమాజక్షేమమును, గుర్తించు వ్యక్తులు, ఈ నాడు కఱవైపోవడంచేత, మనకట్టి ప్రబోధలు, ప్రచారములుచేసి, మన భరత మాత తత్త్వాన్ని, హృదయాన్ని, సంతృప్తిపరచు ప్రయత్నమునకు కొంత విలంబనము జరుగుచున్నది.

ఈ నాడు ఆత్మవిశ్వాసము అడుగంటిపోయినది. తరతరములనుండి కరుడు గట్టిన దేశభక్తి, దేశ విశ్వాసము, విద్యార్థుల హృదయమును చేరుటకు అతి దూరముగా ఉన్నవి. నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక ములను ప్రబోధించి, బాలుర చిత్తములు ఉల్లాసవంత ముగా, ఉపయోగవంతముగా తీర్చిదిద్దు విద్యారంగము ఈ నాడు క్షీణించింది.

బాలబాలికలారా! ఇది నిద్రించుటకు సమయము కాదు. 'ఉత్తిష్ఠత; జాగ్రత; ప్రాప్యవరాన్నిబోధత. అజ్ఞానాహంకారస్వార్థములనే నిద్రనుండి, అలక్ష్య మనే నిద్రనుండి విద్యార్థులు మేలుకొని భరతమాత యొక్క సుక్షేమాన్ని ఆశించుటకు కంకణం కట్టుకో వాలి. భరతమాతముద్దుబిడ్డలు వేలకు, లక్షలకు, కోట్లకు ఉండికూడనూ మాతృమనస్సును సంతృప్తి పరచే వ్యక్తులు కరవైపోవడం మహావిచారకరం! రాముడి కొమరులైన లవ కుశులు, తల్లి శోకమును గుర్తించి, అనేకవిధములుగా ప్రార్థిస్తూవచ్చారు. "తల్లీ, ఊరకే కన్నీరు నింపకారణమేమమ్మా! శ్రీరాముని మించిన వీరకుమారులము మేము; కోరితే బంగారుకొండ కొనితేగలమమ్మా! చెప్పకున్న వద లము, నీపాదములు. తల్లి చింత తీర్చలేని తన యుల బ్రతుకేలనమ్మా", అని ప్రశ్నించారు. కనుక భూజాత పుత్రులు లవకుశులైన బాలురు తల్లియానతి ప్రకారము, తల్లిశోకమును తీర్చే నిమిత్తమై ఇంత తహతహలాడిన చిత్రాన్ని మీ హృదయాలలో ప్రతి ష్ఠించుకోవాలి.

భూజాతపుత్రులే తల్లి చింతను తీర్చేనిమిత్తమై ఇన్ని విధములైన ప్రయత్నములు చేసినప్పుడు భూమాత పుత్రులైన భారతీయులు, భారతీయుల పుత్రు లైన బాలబాలికలు, తమ మాతృమూర్తి చింతను తీర్చేనిమిత్తమై కించిత్తైనా ప్రయత్నము చేయకుండా ఉండటం చాలా విచారకరం. భారతదేశమునందు అణువణువూ పవిత్రమైనదే. మనకు ప్రాప్తించిన కాలము మహాపవిత్రమైనది. ధర్మమును ఆచరిం చుచు, ప్రేమను ప్రసరించుచూ, శాంతముతో జీవిం చడమే ఈనాటి మానవత్వప్రధానమైన కర్తవ్యం.

ఐక్యతకు మించిన మహాబలమైన శక్తి ఇంకొకటి లేదు. ఈనాడు ఐక్యత అనేకవిధములుగా చిన్నా భిన్నమై కనిపించుచున్నది. వ్యష్టిగా సాధించలేని దివ్యకార్యములను సమిష్టిగా సాధించుటకు అవకాశ మున్నది. కనుక సమాజ సుక్షేమాన్ని గుర్తించి, వ్యష్టిగాకాక, సమిష్టిరూపమును నిరూపించి తద్వారా ఈ సమస్యలను తీర్చుటకు తగిన కంకణం కట్టుకోవాలి. అన్యోన్యత, ఐకమత్యములేని జీవితము కేవలము వ్యర్థమైపోతుంది. ఈ ఐకమత్యమునకు, సమరస మునకు సరియైనట్టిది మానవుని దేహమే.

మానవుని దేహము అనేక అంగములతో సృష్టింప బడుతూ వచ్చింది. ఏయేఅంగములకు కేటాయించిన కార్యములను, ఆయా అంగములు సక్రమమైన మార్గ ములో చేయుచున్నవి. తమ తమ కర్తవ్యాలను తాము నిర్వర్తించుటయేకాక, మిగిలిన అంగములను కూడా, సామరస్యముతో, ఐక్యముతో ఆచరించుచూ వస్తున్నవి. ఒక దానినొకటి అనుసరించుచూ రావడం చేతనే, ఈ జీవితమునందు ఈ దేహతత్త్వము, అనేక

విధములైన ఆదర్శములను అందించుచూ వస్తున్నది. మనస్సుఫలాన ప్రదేశానికి పోవాలి అని సంకల్పించిన తక్షణమే కాళ్ళునడుస్తూ ఉన్నవి. ఫలాన పనిచేయాలి అని మనస్సులో సంకల్పించిన తక్షణమే చేతులు ఆ పనిలో ప్రవేశిస్తాయి. ఫలానవ్యక్తిని చూడాలి అని మనస్సు సంకల్పించిన తక్షణమే కన్నులు ఆవ్యక్తి కోసం వెదకుతూన్నవి. కనుక ఈవిధముగా అన్ని ఇంద్రియములూ, అన్ని అంగములూ, మనసును అనుసరిస్తువస్తున్నవి.

ఇక మనస్సు ఏవిధమైన ఆచరణను అనుసరిస్తూన్నది, అనే విషయాన్ని మనం విచారించాలి. ఈ దేహమునందున్న ఏ అంగమునకు ప్రమాదము జరిగినప్పటికినీ మనస్సు, చాలా విచారిస్తున్నది. కాలికి దెబ్బతగిలెనా కన్ను ఏడుస్తున్నది. ఈ విధముగా దేహమునందున్న ఒక్కొక్క అంగముకూడా ఒక్కొక్కదాన్ని అనుసరిస్తూ, ఒక్కొక్కదాని సుక్షేమాన్ని ఆశిస్తూ తమ తమ కర్తవ్యకర్మలను ఆచరిస్తూఉన్నవి. అట్లుకాకుండా కేవలము తమకు నియమించిన కార్యమే తమకు ప్రధానమని భావించి ఒక్కొక్క అంగము తనకార్యములనుమాత్రమే సాధిస్తూ పోవడం చేత కలుగు ప్రమాదముఏమిటో మనము కొంత విచారించాలి.

ఇక మన హృదయము రక్తమును సర్వాంగములకూ సరఫరాచేస్తూ వస్తున్నది. ఈ విధముగా చేస్తూన్నసమయమునందు మిగిలిన అంగములు కొంత (జెలసీ) jealousy అసూయాభావము చేతగానీ ఇంకేవిధమైన క్రోధము చేతగానీ, ఎదురు తిరిగి ఒక సమ్మెను ప్రారంభివడానికి కనుక ప్రయత్నం చేస్తే మిగిలిన దేహమంతాకూడా క్షీణించడానికి అవకాశమున్నది. ఏవిధంగా ఇది సమ్మెను ప్రారంభిస్తుంది? సర్వాంగములు ప్రోగుచేసిన ఆహారమును కేవలము మనకు అందించక, ఒక్క నోరు మాత్రమే భుజించుచున్నదే అను అసూయాభావము మిగిలిన అంగములలో ప్రవేశించినప్పుడు, మిగిలిన అంగములు తమ తమ పనులను తాము స్తంభింపజేసినప్పుడు, దేహమే క్షీణించిపోతుంది. ఇదేవిధముగనే దేశమునకు అంగములైన మానవులు తమ తమ కర్తవ్యాలను తాము నిర్వర్తించక, ఒకరినొకరు ద్వేషించుచూ, ఒకరిమీద ఒకరు అసూయ చెందుతూ, విప్లవానికి దారి తీయడం చేత దేశపరిస్థితికూడా, క్షీణించిపోవడానికి కారణమయింది.

ఎవరి స్వార్థమును వారు అభివృద్ధి పరచుకొనుటకు ప్రయత్నించకూడదు. స్వార్థమే మహా పిశాచము. తాను, తనవారు మాత్రమే సుక్షేమంగా ఉండాలని, ఇతరుల పరిస్థితి ఏమైననూ ఫరవాలేదనే స్థితిలో మానవుడు జీవించకూడదు. అన్యోన్యతను అభివృద్ధిపరచుకొనే విధానాన్ని ఈ నాడు మనం అవలంబించాలి. ఈ అన్యోన్యత ఈ నాడు క్షీణించిపోవడంచేతనే భారతదేశముయొక్క భవిష్యత్తు ఏవిధమైన దుస్థితిపాలవుతుందోననే భయభ్రాంతులు ప్రతిమానవునియందునూ చెలరేగుతున్నవి.

ఇట్టి స్థితియందు, నేటి బాలవికాస్ విద్యార్థులు, విద్యార్థినులు, ఈ సత్యాన్ని గుర్తించి భవిష్యత్తుకు తగినంత భద్రతను ఏర్పరచుకునే నిమిత్తమై మొట్టమొదట తమ విశ్వాసాన్ని బలపరచుకోవాలి. ఆత్మవిశ్వాసాన్ని బలపరచుకునే నిమిత్తమై అనేక విధములైన సాధనలను మనం సలుపవలసివస్తుంది. అనేక విచారణలనుకూడా, చేయవలసివస్తుంది. ఈ విధమైన విచారణలనుసలిపి ఆత్మవిశ్వాసమును బలపరచుకున్నప్పుడే ఆత్మత్యాగము అనగా సెల్ఫ్ శాక్రిఫైస్ (selfsacrifice) ఆత్మసందర్శనమునకు అర్హులవుతాము.

బాలబాలికలారా ! మనస్తత్త్వమును సంస్కరింప చేసుకునే విద్యలు, ఈ నాడు మనకు అత్యవసరం. ఈ నాటి విద్యలన్నియూకూడా, మాయావిద్యలు. ఈ నాటి యంత్రములన్నియూకూడా పొట్టకూటి యంత్రములు. ఈ నాటి జ్ఞానము లౌకికవిద్యాజ్ఞానము. కనుక నిత్యజీవితమును పోషించుకునే నిమిత్తమై కొన్ని లౌకికవిద్యలు అవసరమే ! ఇవి కేవలము జీవనోపాధి నిమిత్తమై ఏర్పడినవి. జీవనోపాధితోపాటు జీవితపరమావధినికూడా గుర్తించడం మన ప్రధానమైన లక్ష్యం. జీవనోపాధిని మనం ఆధారం చేసికొన్నప్పుడు, జీవిత పరమావధి అనే పరమతత్త్వమును ఏనాడు మనం గుర్తించుతాం ?

బాలబాలికలారా ! జీవనోపాధి కేవలం ఒక 'నెగెటివ్ ' వంటిది. జీవితపరమావధి 'పాజిటివ్ ' వంటిది. జీవనోపాధి అనేది కేవలం ఒక 'బల్బు' వంటిది. జీవితపరమావధి 'కరెంట్' వంటిది. జీవనోపాధి అనే 'బల్బును ' మాత్రమే మనం ప్రధానంగా చూసుకుంటే 'కరెంట్ ' లేకపోతే వెలుతురు, మనం, పొందలేము. కనుక ఈ జీవనోపాధి అనే 'బల్బు'నకు జీవితపరమావధి అనే 'కరెంటు'ను కూడా కొంత మనం సంపాదించుకోవాలి. ఈ రెండింటి ఐకమత్యము చేతనే, మన జీవితము జీవనజ్యోతిగా రూపొందుతుంది. కనుకనే Light of Life అని, జీవితమునందు జీవనజ్యోతి ఏనాడు మనం వెలిగించుకొందుమో, ఆనాడే మానవత్వము సార్థకమవుతుంది. దైవవిశ్వాసాన్ని మనం గాఢంగా పెంచుకోవాలి. దైవవిశ్వాసమే గనుక లేకపోతే మనం దయ్యాలుగా రూపొందుతాము. ఇంక మానవత్వ సార్థకతకు కారణమేమి ? " జంతూనాం నరజన్మ దుర్లభం " అనేదాన్లో ఉన్న అంతరార్థమేమిటి ? అగోచరమై, అవ్యక్తమై ఉన్న శక్తిని ఏమానవుడు వ్యక్తీకరింప చేస్తాడో అతనికే మానవత్వమనే పేరు సార్థకమవుతుంది. కనుక ఆత్మవిశ్వాసాన్ని మనం పెంచుకోవాలి. విశ్వాసమే లేకపోతే ఒక్కక్షణకాలమైనా మనశ్వాస నిలవదు. ఒక 'మార్కెట్'కు' వెళ్ళి కొంత సామాను తీసుకోదలచిన వ్యక్తి, 'మార్కెట్ 'కు వెళ్ళి నేను ఇంటికి తిరిగిరాగలను అను విశ్వాసమే లేకపోతే ఆవ్యక్తి 'మార్కెట్ 'కు ప్రయాణం చేయలేడు. ఇల్లుకట్టుటకై ప్రయత్నము చేయువ్యక్తి పునాదులు తీసి ఈ ఇల్లు నేను పూర్తి చేయగలను ! అనే విశ్వాసమేలేకపోతే, పునాదులను తాను ప్రారంభించడు. నేను 'స్కూలు'కు వెళ్ళి ఇంటికి తిరిగి వస్తాను అనే విశ్వాసమే లేకపోతే తాను 'స్కూలు 'కే వెళ్ళడు. మనకు 'హోంవర్కు ' ఇచ్చినారంటే నేను రేపటి దినము తిరిగి దీనిని సరిగ్గా చేసుకుని, టీచరుకు అప్పచెప్పగలననే విశ్వాసమే లేకపోతే తాను 'హోంవర్కు ' నకే పూనుకోడు. ఇలాంటి చిన్న చిన్న నిత్యజీవితములో సంభవించే విషయములందు గాఢమైన విశ్వాసమున్నది మానవునికి.

కుమారుడు పుట్టిన తక్షణమే వాడిని విద్యావంతుడిని చేసి అమెరికాకు పంపాలని పదివేల రూపాయలు ముందుగనే 'బ్యాంకులో డిపాజిట్ ' కట్టుకుంటున్నాం. పదిసంవత్సరములవరకు ఆకుమారుడు జీవించగలడను గ్యారంటీఏమి? కేవలము లౌకికమై, అనిత్యమై, అశాశ్వతమై, అసత్యమైన విషయములందు గాఢమైన విశ్వాసాన్ని మనం బలపరచుకుంటున్నాము. నిత్యసత్యమైనటువంటి దైవతత్త్వాన్ని ఈనాడు మనం విస్మరిస్తున్నాము. కనుక మానవునికి ఆనందం లభించాలంటే సంతోషం ప్రాప్తించాలంటే ఇలాంటి విశ్వాసం, లేకపోతే ఏరీతిగా తానాయానందాన్నిపొందగలడు ? కనుకనే మొట్టమొదట ' సెల్ఫ్‌కాన్ఫిడెన్స్ '; ఆత్మవిశ్వాసము : రెండవది 'సెల్ఫ్ శాటిస్‌ఫాక్షన్ ' ఇట్టి

ఆత్మవిశ్వాసాన్ని కలిగిఉండిన ఈ ఆనందమనేది మనకు లభిస్తుంది. ఆత్మవిశ్వాసము లేనటువంటి వానికి ఆనందం ఎంతదూరంగా ఉంటున్నది. అట్టి వారు ఆనందం నటించవచ్చునుకానీ నిజమైన ఆనందం అనుభవించలేరు. కనుక ఈ "సెల్ఫ్‌శాటిస్‌ఫాక్షన్" ఉండినప్పుడే 'సెల్ఫ్‌శాక్రిఫైస్' చేస్తాము. తాను సంతోషముగా లేనప్పుడు ఏవిధమైన త్యాగమునకు పూనుకుంటాడు? కనుక ఈ త్యాగమునకు "శాటిస్ ఫాక్షన్" 'తృప్తి' అనేది అత్యవసరం. ఎప్పుడు ఈ 'శాక్రిఫైస్" అనేది చేస్తాదో 'సెల్ఫ్‌రియలైజేషన్' అనేది మనకు లభిస్తుంది.

కనుకనే నాలుగు 'S' లలో ఉన్న జీవితరహస్యాన్ని మనం గుర్తించాలి.

First S — Self Confidence
Second S — Self Satisfaction
Third S — Self Sacrifice
Fourth S — Self realization

ఈనాలుగింటియొక్క రహస్యాన్ని మనం ఏనాడు గుర్తింతుమో అప్పుడే 'Four' f లకు మన Life ను అంకితం చేస్తాము. Frist f – follow the Master. 'మాస్టర్' అనగా ఎవరు? మన బాలవికాస్ గురువా లేక పాఠశాలలోనున్నటువంటి గురువా? ఈ గురువులు మార్పుచెందువారు. నీయొక్క హృదయమే, నీ 'కాన్షస్‌నెస్' నీ మాస్టర్. నీ కాన్షస్‌నెస్‌ను నీవు 'ఫాలో' చేసినప్పుడే నీజీవితము భద్రమైన స్థానాన్ని అందుకుంటుంది. కనుకనే follow the Master. నీ కాన్షస్‌నెస్‌ను నీవు ఫాలో చేయుము.

1st f —follow the master
2nd f — face the devil.

నీదుర్గుణములను, దుర్బుద్ధులను దురాలోచనలను, దుర్భావములను కొంతవరకైనా దూరం చేయాల్సి ఉంటుంది. ఇక మూడవ f – fight to the end. 4th f – finsh the game. ఈ నాలుగు f లకూడ మీరు నిరంతరము హృదయములో పెట్టుకుని ఉండాలి.

బాల్యమునందే, ఈ పవిత్రమైన రహస్యాలను గుర్తించినందువల్ల, ఎంతైనా మీరు భవిష్యత్తులో ఆదర్శవంతమైన జీవితాన్ని అందించడానికి అవకాశముంటుంది. కనుక నేటి బాలబాలికలే భవిష్యత్తులో పౌరులుగా రూపొంది, ఈ పవిత్రమైన భారతదేశ విచారమును కొంతవరకు దూరంగావించి ఆ తల్లికి తగినటువంటి ఆనందాన్ని అందించే ముద్దుబిడ్డలుగా మీరు రూపొందుతారని నేను ఆశిస్తున్నాను. మొట్టమొదట మీ దేహమాతను సంతృప్తిపరచడానికి ప్రయత్నించండి. మీదేహము, మీఆహారము, మీవస్త్రము, మీజీవితము అంతయూ మీతల్లి ప్రసాదమే. కనుక దేహమిచ్చిన మాతను సంతృప్తిపరచడానికి, ఈ బాలబాలికలు మొట్టమొదట కంకణం కట్టుకోవాలి. ఆవిధమైన మార్గమునందు ఉత్తీర్ణులైన వారే దేశమాతను సంతృప్తిపరచుటకు, అర్హులౌతారు. దేహమాతనే సంతృప్తిపరచలేని అల్పుడు, బలహీనుడు, దేశమాతనేవిధంగా సంతృప్తిపరచగలడు? కనుక 'మాతృదేవోభవ'; 'పితృదేవోభవ'; 'ఆచార్యదేవోభవ' 'అతిథిదేవోభవ'; అని వేదము. మొట్టమొదట తల్లిదండ్రులను గౌరవించి, గురువులను గౌరవించి, ఇంటికి వచ్చినటువంటి అతిధులను గౌరవించి, చక్కని తీయనిమాటలచేత, వినయముచేత, విధేయత చేత వారిని ప్రసన్నులను గావించుకునే విధానాన్ని ఈనాడు బాలబాలికలు చేపట్టాలి. ముఖ్యముగా విద్యార్థులు వినయవిధేయతలు పెంచుకోవాలి. అలక్ష్యము గాకానీ, అహంకారంతోగానీ, ప్రవర్తించకూడదు.

పిల్లలందఱు ఒకరినొకరు అన్నదమ్ములవలె, అక్కచెల్లెళ్లవలె ప్రేమించాలి. ఏచిన్నవిషయానికి గానీ, ఒకరితో ఒకరు కలహించుకోకూడదు. మీకలహము చిన్నదిగా రూపొంది, తదుపరి పెద్దదియై బ్రహ్మాండము నంతా ఆవరించుకుంటుంది. మఱ్ఱివిత్తనముచాలా చిన్నదిగా ఉంటుంది. దాన్నిపెంచడంచేత బ్రహ్మాండమైన వృక్షంగ రూపొందుతుంది. కనుక ప్రప్రథమంలో అణుస్వరూపమైన నీద్వేషమునుగానీ. అసూయను గానీ అప్పటికప్పుడే అరికట్టడానికి ప్రయత్నించవప్పుడు ఇది బ్రహ్మాండమైన వృక్షంగా రూపొందదు. కనుక మన జీవితమును;

Start the day with love
Spend the day with love
Fill the day with love
End the day with love

ఈ ప్రేమతత్త్వాన్ని మన హృదయములో వింపు కొనుటకు ప్రయత్నం చేయాలి. భావిభారతోద్ధారకులు మీరే.

సత్యసాయి బాలవికాస్ బాలబాలికలు భవిష్యత్తులో దేశమునకు ఆదర్శవంతమైన జీవితాలను అందిస్తారనే విశ్వాసము స్వామికి గాఢంగా ఉన్నది. ఈనాడు దేశములో చెలరేగుచున్న అన్యాయ, అక్రమ, అనాచార, అసత్య, అధర్మములనెడి పెనుభూతములను హతమార్చి, శాంతి, సంతోష, సౌఖ్యములను అందించు అధికారులు బాలవికాస్ బాలబాలికలే; ఈఅధికారమును సాధించి, ఆనందముతో జీవితమున ముందంజ వేస్తూ, భారతదేశమునుద్ధరించుటకు కంకణము కట్టుకొను మహావీరులు, పవిత్రులు, శూరులు, భక్తులు, త్యాగులు, యోగులు, మునులుకూడ మీరే అగుచున్నారు. అధ్యాపకులుకూడా ఈ ముక్కుపచ్చలారవి బాలబాలికల భవిష్యత్తును తగినమార్గములో నడిపే నిమిత్తమై, తగిన కృషిచేసి. తగినప్రోత్సాహ ఉత్సాహములను వారికందించి, శాంతమనస్కులై వారినుద్ధరించుటకు తగిన త్యాగమునకు పూనుకోవాలని నేను ఆశిస్తున్నాను.

—బాలవికాస్ బాలబాలికలకు
భగవానుని దివ్య సందేశము.
22-11-79. ప్రశాంతినిలయము.

# "విద్యాం దదాతి - - - -"

1980 ఫిబ్రవరి 10 తేది ఉదయం వైట్‌ఫీల్డ్ బృందావనం శ్రీ సత్యసాయి కళాశాలఆడిటోరియంలో, బెంగళూరు శ్రీ సత్యసాయి స్టడీసర్కిల్ యొక్క విశేషసమావేశం జరిగినది. అందులో మూడు వందలకుపైగా సభ్యులు పాల్గొనిరి. నగరములోని కాలేజీలలోని ప్రాధ్యాపకులూ, వైజ్ఞానిక పరిశోధనాలయములకు చేరిన విద్యావేత్తలూ, ఈనాటి యువతరమును సరియైన పంథాలో నడిపించడానికనువైన మార్గదర్శకత్వం ఇవ్వడానికి ఉద్యుక్తులై ఉత్సాహముతో, సమావేశమునకు వచ్చిరి. శ్రీ వారి దివ్యసందేశమునందు కొని, ఆదర్శాలననుసరించుటకు వారందరూ చాలా ఆసక్తితో వేచియుండిరి.

స్టడీసర్కిల్ సంచాలకులు ప్రొఫెసర్ S. V. పప్పు గారు అందరినీ స్వాగతిస్తూ శ్రీ వారిచరణకమలముల యందు వారి భక్తిశ్రద్ధలను సమర్పించిరి. సర్కిల్ సభ్యులు అనుసరించవలసిన కార్యక్రమములనూ వారి దృష్టిపథములో ఉండవలసిన ఆదర్శములను బోధించవలెనని వారు స్వామిని ప్రార్థించిరి. ప్రస్తుతము విద్యాసంస్థలలో శిక్షణపద్ధతులలో ప్రకటితమగుచున్న లోపదోషాలను స్వామి మాత్రమే తీర్చిదిద్దగలరనియూ, వారి ఆధ్వర్యమున స్థాపింపబడిన కాలేజీలు, ఉన్నతపాఠశాలలు, బాలవికాస్‌తరగతులను పరిశీలించిన వారికి ఇది స్పష్టమగును, అనియు ప్రొ॥ పప్పుగారు ప్రస్తావించారు.

డా॥ వి. కె. గోకాక్ గారు మాట్లాడుతూ, విద్యాక్షేత్రముయొక్క అయోమయస్థితిని, చక్కగా వివరించారు. ప్రజల తల్లితండ్రుల తామసమనోభావమే దీనికి ముఖ్యకారణమన్నారు. విశ్వవిద్యాలయాలు వాటి పాఠ్యక్రమనిర్ణయసమితులు అధ్యాపకులూ, తీరికలేని రాజకీయనాయకులూ సంవత్సరాలకొద్దీ ఈ క్షేత్రమును గమనించలేదన్నారు. క్రొత్తఆలోచనా సరణికి ప్రభుత్వము ప్రోత్సాహంకానీ ఆదరణకానీ ఇవ్వటం లేదని స్పష్టంచేశారు. అందువల్ల, ప్రజ్ఞావంతులూ, ఆదర్శవాదులూ దేశోన్నతిసాధకులు అయిన కొంతమందిమాత్రం ప్రయత్నముచేసి ప్రయోగపాఠశాలలను ప్రారంభిస్తున్నారని చెప్పారు. భారతీయ సంస్కృతి ఆధ్యాత్మికసాధనలు వీటిని వేసవి తరగతులద్వారా భగవానులవారు విద్యార్థులకందిస్తున్నారని విశదం చేసారు.

తదుపరి, శ్రీ T. A. పైగారు ఉపన్యసించిరి. విద్యారంగములో కృషి చేస్తున్నవారినావరించిన నిస్సహాయస్థితిని గురించి వారు వివరించారు. బుద్ధిబలముతో పరిస్థితిని శుభ్రపరచుటకు వీలు లేదనియూ ప్రేమబలమువలననే ఇది సాధ్యమనియూ చెప్పిరి.

తరువాత, స్వామివారు తమదివ్యోపన్యాసమునను గ్రహించారు.

సత్యధర్మప్రేమశాంతులు లేకున్న
 విద్యలన్నియునేర్చి విలువ సున్న
సత్యధర్మప్రేమశాంతులు లేకున్న
 దానధర్మాల సార్థకత సున్న
సత్యధర్మప్రేమశాంతులు లేకున్న
 బహుళసత్కార్యలాభంబు సున్న
సత్యధర్మప్రేమశాంతులు లేకున్న
 పదవుల నేలిన ఫలము సున్న
మన సనాతనధర్మహర్మ్యంబు నిలువ
గుణములివి నాల్గును పునాది గోడలప్ప
ఇంతకన్నను వేరెద్ది ఎరుక పరతు
సాధుసద్గుణగణ్యులౌ సభ్యులార!

దివ్యాత్మస్వరూపులారా!

దేశవిదేశజనులను అయోమయస్థితిలో ముంచివేస్తున్న సమస్యలు ప్రతిరంగములోను కనుపించును. అయిననూ, వాటిని ఎదుర్కొని ఆ రంగములను పుష్టివంతముగా ఉపయోగకరముగా తీర్చిదిద్దుటకుప్రయత్నించవలసియున్నది. విద్యాక్షేత్రమందు, పతనోన్ముఖముగా పయనించుచున్న ప్రాచీన సంస్కృతిని పరిష్కారముచేసి జీవితములో సామరస్యము, సమన్వయము సమత్వములను అభివృద్ధిగావించవలసియున్నది. విద్యయొక్క అంతరార్థము ఏమి అని తెలుసుకోవాలి. అంతఃకరణమును పరిశుద్ధపరిచేదేవిద్య, నైతికధార్మిక ఆధ్యాత్మిక శీలసంపదను అభివృద్ధి గావించే విధానమే విద్య. ఏది చీకటి, ఏది వెలుతురు అన్న వివేచననుపెంపొందించి, నిరూపించేదే విద్య. కేవలం గ్రంథములను

చదువుట, వ్రాయటం కానీ విద్యకానేరదు. అది గ్రంథ విద్య మాత్రమే అగును. ప్రత్యక్షజ్ఞానం లేక, పరోక్ష జ్ఞానానికి విలువ సున్న. పరోక్షజ్ఞానాన్ని ప్రత్యక్షజ్ఞానముతో జోడించి లోకకల్యాణానికి ఉపయోగపెట్టాలి. కానీ, నేటివిద్య, పూర్తి యాంత్రికంగా కనిపిస్తున్నది. దీనిలో ఎలాంటి చైతన్యమూలేదు, నైపుణ్యములేదు. మానవత్వములోని దివ్యత్వాన్ని ప్రబోధించే అవకాశం మచ్చుకైనా కనిపించడంలేదు. చేతులకు మట్టికాకుండా ఇస్త్రీగుడ్డలు నలుగకుండ, ఏమార్గమంనైనా అధిక లాభార్జన జేయడం నేటివిద్యయొక్క పరమార్థముగా మారిపోయినది. కష్టించి శ్రమించి చెమటార్చి నిద్రాహారాలుమాని సంపాదించేది విద్యయొక్క సారమని దానియొక్క దృక్పథము మారాలి. నేటి విద్య ప్రతి వ్యక్తిని ఇంద్రియాలకు దాసుడిని చేసి, త్యాగములేని స్వార్థ పరుడుగా. అసూయపరుడుగా తయారుచేయుచున్నది. ఉద్యోగము విద్య యొక్క పరమోద్దేశము కాదు; యోగమే నిజమైనగురి. నీతి నిజాయితి వీటితో సంబధంలేని శిక్షణక్రమమును తొలగించి. విద్యావంతులలో వినయవిధేయతలు, సేవామనోభావము, దైవప్రీతి, పాపభీతిని అభివృద్ధిచేసి, వాటివలన ప్రతి ఇంటినీ తేజోవంతముగా మార్చాలి.

విద్యారంగం ఈ నాడు అయోమయస్థితిలో వున్నది; ఎక్కడ చూపినా సమస్యలు. మానవజీవితంలో నిత్య సత్యముగా ప్రకాశించే, నిత్యనూతనముగా వెలుగొందే ప్రాచీన సంప్రదాయాలను, భారతసంస్కృతిని, దేశ కాలానుగుణ్యంగా సంస్కరించడంవలన, ఈ సమస్యలను తీర్చిదిద్దవచ్చు.

ముఖ్యముగా, పరదేశీయుల అనుకరణాభిలాష భారతీయుల పెద్దదుర్యోగము. ప్రపంచములో విజ్ఞానపథమందు పయనిస్తూ అధికులమని విర్రవీగే రష్యా అమెరికా దేశాలకంటే, మనదేశములో వేదకాలమందే అధికమైన అభివృద్ధి జరిగింది. భారతీయుల అధర్వణ వేదం ఆధారంగా పరదేశీయులు ఎన్నో వైజ్ఞానిక పరిశోధనలు చేయుచున్నారు. యంత్రశక్తి, అణుశక్తి తంత్రశక్తి మంత్రశక్తులన్నీ అధర్వణ వేదములో వివరింపబడినాయి. పాశ్చాత్యులు విమానంకనిపెట్టడానికి కొంతవరకు అధర్వణ సూక్తులు దోహదం చేసినవి. "పక్క ఇంటి పప్పురుచి" అన్నట్లు రానురాను విదేశీయుల అనుసరణ అనుకరణలు ఎక్కువ అయి వారి సంస్కృతి వారిజీవన తత్త్వమే భారతీయులకు ప్రియమై పెరుగుచున్నవి.

1903 డిసెంబర్ 17న అమెరికాదేశంలో రైట్ సోదరులు విమానం కనిపెట్టారు. కానీ, అంతకు ముందుగానే 1898 సెప్టెంబర్ 13 న జర్మనీ దేశస్థుడు దీనిని కనిపెట్టాడు. అంతకుముందుగా 1895 ఆగస్టు 14నందు మనభారతీయుడు బొంబాయికి చేరినవాడు. వామన్ బాపూజి అనేవాడు, విమాన నిర్మాణమును సూచించాడు. కానీ, విమానపరిశోధనలో భారతీయుని పేరు రాకపోవడానికి కారణము మనలోని అసూయ దుర్బుద్ధి, అనైక్యతలే కారణము.

అందుకే నేడు అన్నిక్షేత్రములలోను ఐకమత్యము అత్యవసరము. అలాగే, మానవత్వాన్ని పెంపొందించే గుణములుకూడా అభివృద్ధికావాలి. కావలసినవి డిగ్రీలు కావు; విద్యనార్జించేది డిగ్రీలకోసం అనే వెర్రిని విడిచి పెట్టి, సేవకావృత్తి కైజంకక, స్వీయదేశీయ సౌభాగ్యాన్ని తెలుసుకొని ప్రకృతివిద్యలను నేర్చుకోవాలి. యువ జనాంగములో ఎంతోశక్తి ఉన్నా బలహీనులవలె బతుకుతూ కాలమును వృథాచేస్తున్నారు. ఐక్యతవలన ఆనంద

మును, ఆనందమువలన పవిత్రతను సంపాదించుకోవాలి. యువకులకు సహనముచాలాముఖ్యము. క్షమమే సత్యం; క్షమమే ధర్మము; క్షమమే యోగము; అదియే సంతోషము, అదియే అహింసాగుణము. క్షమమే సర్వస్వము, క్షమ ప్రేమ రెండు ఒకే గుణమునందున్న రెండు ముఖాలుమాత్రమే.

నేటివిద్య వినయవిధేయతలను పెంచక, అహంకారాన్ని అసూయను పెంచుతూన్నది. విద్య అంటే వెలుగు, కాంతి, తేజస్సు. దానివలన దొరకవలసినది గ్రంథపరిచయం కాదు, అనుభవజ్ఞానమే। వ్యక్తికీ సమాజమునకూగల సంబంధాన్ని గుర్తింపజేసేది, జ్ఞానము మనలోని ప్రాత అనుభవాలను క్రొత్త అనుభవాలకు చేర్చి సమన్వయంచేసి నైతికప్రవర్తనను పెంపొందింపజేసేదే జ్ఞానము.

మితిమీరిన ధనము మతిహాని కలిగించును. లౌకిక విద్యలు అహంకారము ఆడంబరములకు మూల కారణము. వాటితోపాటు, ఆధ్యాత్మిక సాధనలను కూడ అభ్యసించాలి. శీలమునుకూడ అభివృద్ధి గావించాలి. ఎవరికివారు నీటిమీద నూనెబొట్టు లాగా జీవించేందుకు ప్రయత్నించరాదు. సహాయము సహకారము సేవాబుద్ధితో ఎట్టిసాహసకార్యమైనను సాధించవచ్చు. ఒక దారము చీమను కూడ బంధించ లేదు. అయితే, కొన్నివేలదారాలుచేరి. ఏనుగును బంధిస్తాయి కదా? ఐకమత్యమే సద్గుణం. మనం కోఆపరేషన్ అంటున్నాము కానీ, జరుగుతున్నది కోఆపరేషన్‌కాదు, ఆపరేషన్ మాత్రమే। దానివలన సమాజమందు శాంతిభద్రతలు నిలువవు. యూనియన్ స్థాపించటమువలన, యూనిటీ కుదురదు; కాయితాలలో చేరవచ్చు; కర్మలో చేరటములేదు.

సదస్సుల, సమావేశముల, ఫలితమేమి? కోట్లను వ్యయముచేసి. సభ్యుల సమయమును వ్యర్థముగావించి తీసుకొన్న నిర్ణయాలు కేవలం కాయితంపైననే నిలిచిపోతున్నవి; ఆచరణలో కనిపించడములేదు. గ్రామ గ్రామాలు పర్యటించి క్రొత్తభావాలను విధానాలను అందించేందుకు కంకణం కట్టుకోవాలి. మీ స్టడీసర్కిల్ ద్వారా కొన్ని విషయాలను చక్కగా పరిశీలనజేసి ఆ ఫలితాలను జగత్తులో వ్యాప్తిచేయాలి. ఇతరులకు ఉపకరించే విషయాలను చర్చించి పరిశోధన జరపాలి. తరగతులలో వెనుకబడిన విద్యార్థులకు పేదవారికి సహాయంచేసి, లోకకల్యాణమునకై కృషిచేయాలి.

మేఘాలు ఆకాశములో మెదులుతుండగా వాటిమధ్య విద్యుత్తుమెరిసినట్లు విద్యలోపల జ్ఞానం ప్రకాశించాలి. విద్యావంతుని జీవితమే ఇతరులకు ఒకసందేశముగా మారిపోవాలి. మీ శక్తులను, సామర్థ్యములను, గుణములను, పవిత్రతను, రక్తాన్ని ఈ ఆశయ సాధనకై ధారపోయాలి. ఔషధం పేరుచెబితే, రోగం నయమగునా? డబ్బు పేరు చెబితే పేదరికం పోవునా? పంచభక్ష్య పరమాన్నముల పేరు చదివితే ఆకలితగ్గునా? వాటిని అనుభవించినప్పుడే ఫలితం కలుగుతుంది. విద్యారంగములో చెలరేగుచున్న సమస్యలకు కారణమేమి అని పరిశీలించి పరిహారసూత్రములను అనుసరించి ఆచరణసలుపాలి. విద్యావిధానములో ఉపాధ్యాయులు 'ట్యాంక్' వంటివారు. విద్యార్థులు 'ట్యాప్స్' వంటివారు. ట్యాంక్‌లో మంచినీరు నిండియుంటే, కొళాయిల (ట్యాప్స్) లో మంచినీరు వస్తుంది. తమలోని దోషాలను నిర్మూలముచేసి, విద్యార్థులను ఉత్తములుగా తీర్చిదిద్దేది, అధ్యాపకుల కర్తవ్యం. విద్యయొక్క అంతరార్థము ఇది. సంకుచితస్వార్థభావాలు లేకుండా విశాలమైన పరార్థభావాలను పోషించి పెంచుకోవాలి.

అందరూ ఒక్కటే అన్న ఏకత్వభావాన్ని దృఢపరచుకోవాలి. 'ఈశావాస్యమిదం సర్వం', 'వాసుదేవ

మిదం సర్వం', 'ఈశ్వరస్సర్వ భూతానాం' అని ఉపనిషత్తులు బోధిస్తున్నాయి. తమ పిల్లలవలె ఇతర పిల్లలను అధ్యాపకులు వాత్సల్యదృష్టితో ఆదరించాలి. రసాయనశాస్త్రముతోపాటు వారికి దైవరసాన్ని కూడ అందించాలి. ఫిజిక్స్‌తోపాటు, ఫిలాసఫీనికూడ బోధించాలి. వృక్షశాస్త్రముతోపాటు, జీవితవృక్షాన్ని గురించి తెలపాలి. అర్థశాస్త్రమును బోధించే సమయమందు, దానితోపాటు ఆధ్యాత్మికశాస్త్రమును తెలపాలి. ఈ జీవితం ఒక వృక్షం. ఇక్కడ మనము పెంచుకునే బంధుత్వాలు దానికొమ్మలు, రెమ్మలు; మన ఆలోచనలే పుష్పాలు. ఆవృక్షముయొక్క ఫలమే, ఆనందం. ఆపండులోని తియ్యనిరసమే, సచ్ఛీలం, (క్యారక్టర్). వృక్షముయొక్క వేర్లు ఆత్మవిశ్వాసం.

ప్రస్తుత విద్యారంగంలో ఆత్మవిశ్వాసం అనేవేర్లూ లేవు; సచ్ఛీలం అనే మధురరసమూలేదు; ఇంతేకాక, క్రమశిక్షణ బాగాలోపించినది. చెప్పుట ఒకటి చేయడం మరొకటి, ఆలోచించడం మరొక్కటి, జరుగుతున్నవి. దేహాన్నికాదు. మానవత్వమును, మానవుని మాధవునిగా మార్చే సత్యము ధర్మము శాంతి ప్రేమ వీటిని బలపరచి అభివృద్ధిగావించుకోవాలి. ఇదే విద్యాసంస్థలయొక్కగురి; విద్యాభ్యాసము యొక్క సార్థకత.

మధ్యాహ్నభోజనము తరువాత, సర్కిల్ సభ్యులు కాలేజిలోని 'ప్రజ్ఞానప్రదర్శనము' అనే ఆధ్యాత్మిక ఎక్సిబిషన్''ను సందర్శించి ఆనందించిరి.

సంపాదకుడు

# "సాయి సామ్రాజ్యము"

పుస్తకముల్ పఠించితిని—పూర్తిగ చూచితి సర్వ
శాస్త్రముల్
విస్తులమైన విద్యలను—నేర్చితినంచును గర్వమెందుకీ
హస్తయుగంబు మోడ్చిపర—మాత్ముని భక్తితొ కొల్వ
లేనియీ
ప్రస్తుత విద్యలన్నియుస్థి—రంబున విష్ఫలమౌను
మానవా!

ఎమ్మేలు బీయేలు—ఏర్పడ చదివియు
పేరుగాంచిన పెద్ద—వారలైన
సంపదలుండియు—సద్దానపరులౌచు
పుడమికీర్తి విగన్న—పుణ్యులైన
ఆయురారోగ్యంబు—లనవరతంబుండి
పరిపూర్ణ బలులగు—వారలైన
సతతంబు జపములు—చాలంగ చేయుచు
వేదములను నేర్పు—విప్రులైన
సాటిరారు భక్తులకు నే-నాటికైన
దైవమునుగొల్వనిదెరాదు—దండి శక్తి
ఇంతకన్నను వేరెద్ది—యెరుకపరతు
సాధుసద్గుణగణ్యులౌ—చట్టులార!
చదువులన్ని చదివి—చాల వివేకియై
మదిని తన్నెరుగడు—మందమతియు.
ఎంతచదువు చదివి—యేనీతివిన్నను
హీనుడవగుణంబు—మానలేడు.
తరచి చదువు చదువ—తర్కవాదమెగాని
పూర్ణమైన యెఱుక—పొందలేడు
చదువు, చదివి, చదివి—చావంగ నేటికి
చావులేని చదువు—చదువవలయు.

దివ్యాత్మస్వరూపులైన విద్యార్థులారా! విద్యాభి

మానులారా! విద్యాపోషకులారా! కడచిన యుగము లకంటే ఈ కలియుగములో కడతేరుటకు అనేకసులభ మార్గములున్నవి. వివేకమా! కావలసినంత ఉన్నది. విద్యయా! చదువుటకు వేలాది కళాశాలలున్నవి. ధనమా! ఆర్జించుటకు అనేకసులభోపాయములు కలవు. కానీ, మానవుడు ఇన్ని విధములైన అనుకూలములుండి నప్పటికినీ, శాంతికి నోచుకొనలేక పోతున్నాడు. సౌఖ్యానికి అతిదూరమైపోతున్నాడు. కారణమేమి? దీనికి ప్రవర్తనే కారణము. ప్రవర్తనకు గుణమే ఆధారము. గుణసమ్మిళితమైన ప్రవర్తనయే మానవునికి నిజశాంతిని చేకూర్చును.

సర్వసామాన్యముగా జగత్తునందు, నిజమైన బల మును, నిజమైన బ్రతుకును, జ్ఞానమని చెప్పుదురు. కానీ, ఇదికాదు నిజమైన బ్రతుకు, ఇదికాదు నిజమైన బలము. నిజమైన బలమునకు, బ్రతుకునకు, గుణమే ప్రధానము. యుగయుగములనుండి, ఆదర్శవంతమైన జీవితాన్ని లోకమునకుచేకూర్చిన మహనీయులు అనేకులు న్నారు. జీసస్, మహమ్మద్, జొరాష్ట్రియన్, బుద్ధుడు, శంకరాచార్యుడు, మధ్వాచార్యుడు, రామానుజాచార్యుడు. మొదలగు మతప్రవక్తలు అనాదికాలమునుండి తమ ప్రవర్తనలచేతనే, తమగుణములచేతనే మానవుల హృద యమునందు అమరజీవులుగా నేటికినీ నిలిచియున్నారు. అమోఘమైన కీర్తిప్రతిష్ఠలకు విద్యకాదుప్రధానం, గుణ ప్రవర్తన. ప్రవర్తనలేకున్న పశువుతో సమానం. కనుక చదువు అనగా కేవలం ఒక గ్రంథపరిచయమే నని భావించి విఱ్ఱవీగుతున్నాము. నీ చదువెంత? నీ అనుభవమెంత? నీ అహంకారమెంత? నిత్యజీవిత ములో మానవునికి సత్యమైన సూక్తులు, పవిత్రమైన నడతలు, దివ్యమైన భావములు, ఏవియో గుర్తించడా నికి ప్రయత్నించడమే విద్యయొక్క ప్రధానలక్ష్యం. సత్యాన్వేషణయే విద్యార్థుల ప్రధానకర్తవ్యం.

త్యాగమే జీవిత పరమావధి. ఆశయాలు అందిం చుటలో, ఆదర్శవంతమైన జీవితమును నిరూపించుటలో, జీవితమునైననూ త్యాగము చేయుటయే విద్యయొక్క పరమగమ్యము. రాగద్వేషాలతో అసత్యాలతో దూషి తముకానిచిత్తము, వాక్కు విద్యార్థులకు అత్యవసరం. హింసాదులతో దూషితముకాని కాయము మీరు పవిత్ర ము గావించుకోవాలి. ఈనాడు అట్టివిద్యార్థులు మచ్చు నకైననూ కనిపించుటలేదు.

భారతదేశమునందు శ్రీమంతులు కోటానుకోట్లు కలరు. ఇందులో రాజకీయనాయకులూ మేధావంతు లైన సైంటిస్టులూ దివ్యజ్ఞానమును ప్రబోధించు శాస్త్రజ్ఞు లూ, మహామహా విద్యావేత్తలూ, లేకపోలేదు. ఎంత మంది ఉండి ఏమిప్రయోజనము? ఒకరొకరిమధ్య ఉండే సంబంధబాంధవ్యములు విరుద్ధంగా ఉంటున్నవి. ఒకసైంటిస్టుకు మరొకసైంటిస్టుకు ఒక శాస్త్రజ్ఞునకు మరొక శాస్త్రజ్ఞునకు పరమవిరుద్ధమైన భావములుగలవు. రాజకీయనాయకుల విషయము చెప్పనక్కరలేదు. అనై క్యత అనే పెనుభూతమును శిరస్సునందుంచుకుని ఎన్ని విద్యలు ఎన్ని శాస్త్రములు నేర్చినను, ఎంతవిజ్ఞాన వంతులు అయిననూ, జగత్తునకు ఏ మాత్రమూ శాంతి సుఖములు లేవు. ఏనాడు మానవునియందు సహనము, ప్రేమ, దయ, ఐక్యత, అనునాలుగు గుణములూ అభివృద్ధి అగునో ఆనాడే ఈ జగత్తునకు సుశాంతి గలుగుచున్నది. నిత్యకల్యాణము పచ్చతోరణంగా కిలకిలా కలకలలాడుతూంటుంది.

ఈ నాడు ప్రతివ్యక్తి మహాభారతమునందు ధర్మ జుడు బోధించిన సూక్తులను నిరంతరము స్మరించుచుం డవలెను. ఒకానొక సమయమునందు శ్రీ కృష్ణుడు ధర్మజుని సోదరులెక్కడఉన్నారు ? అని ప్రశ్నించిన ప్పుడు, కొంతమంది సోదరులు హస్తినాపురములో

ఉన్నారు. మరికొంతమంది అరణ్యములో ఉన్నారు. అన్నాడు. అప్పుడు కృష్ణుడు, ''ధర్మజా! మతి పోయినదా! ఉన్న అయిదుమంది సోదరులు అరణ్యమునందేఉన్నారు కానీ, హస్తినాపురమునందు ఎవ్వరూ లేరు కదా !" అని అన్నాడు. ''కృష్ణా! క్షమించు. మేము సోదరులము నూటఅయిదుగురము'' అన్నాడు ధర్మజుడు. కృష్ణుడు ఆశ్చర్యపడ్డాడు. ధర్మజ. భీమ. అర్జున, నకుల, సహదేవు లనియెడి అయిదు మందే కదా! పంచపాండవులని ప్రతిష్ఠ చెందినవారు. నూటఅయిదుమంది అనిచెప్పుటలో గల అంతరార్థమేమిటన్నాడు, కృష్ణుడు. ధృతరాష్ట్రుని పుత్రులు నూరు మంది; పాండవుని పుత్రులు అయిదుమంది. మేమందరమూ సోదరులమే కనుక నూట అయిదుగురము. ఒకరికొకరు కలహించనంతవరకునూ మేము నూట అయిదుగురము. కలహించితిమా మేము అయిదుగురుమాత్రమే!'' అన్నాడు ధర్మజుడు. కనుక కలహము జరిగినప్పుడు సోదరత్వమనేది ఛిన్నాభిన్నమైపోతున్నది. కలహించకుండినంతవరకునూ సర్వులనూ సోదరులే ! ఈ నాడు ఒక్కొక్క గుంపు, ఒక్కొక్క గ్రూపు, ఒక్కొక్క సమితి, ఒక్కొక్క సమూహముగా తయారవుతున్నాయనగా, ఇందులో ఎన్నివిధములైన కలహములు జరుగుతున్నాయో చెప్పనక్కరలేదు. కనుక అనైక్యత మానవుని హృదయాన్ని, మానవుని రక్తాన్ని, ఛిన్నాభిన్నముగావించి, విరుద్ధమైన భావములచేత వ్యక్తిత్వాన్నే నాశనము గావిస్తున్నది.

ఎవనికి ఈ విధమైన అనైక్యత అనేది బలపడిపోతున్నది? సుగుణము లేనటువంటి వానికి, గుణము లేనివాని ప్రవర్తన దుష్ప్రవర్తనగా ఉన్నది. అట్టిప్రవర్తన గలిగినవాడు స్వార్థమే పరార్థంగా భావిస్తున్నాడు. కాన, మానవత్వంలో ప్రధానమైన బ్రతుకుబలములకు ప్రవర్తనమే మూలకారణమను సత్యాన్ని విద్యార్థులు ప్రప్రథమంగా గుర్తించాలి. అడవిలో సంచరిస్తున్న మృగములను చూస్తే నాకు చాలా ఆనందంగా ఉంటున్నది. వాటి ఆనందము, వాటిప్రవర్తన, వాటిస్వేచ్ఛ ఎంతో పవిత్రంగా ఉంటుంటాయి. అడవిలో సంచరించే మృగములు పరుల ఉన్నతిని చూసి ఏడ్వవు. "వారి వలె మేము బ్రతుకలేమే" అనే దుఃఖమును తాము పొందవు. తమకు పేరు ప్రతిష్ఠలు రావాలని ప్రాకులాడవు. పదవులు సంపాదించాలని ప్రణాళికలు వేయవు. అధికమైన ఆస్తిని ప్రోగు చేసుకోవాలనే దురాశ లేదు. ఇన్ని సద్గుణములను బట్టి చూడగా మానవుని కంటే మృగములే ఎంతో గొప్పగా జీవిస్తున్నాయి మానవుడు విద్యావంతుడై, ప్రజ్ఞావంతుడై, వివేకవంతుడై ఉండినప్పటికినీ, దురాశకు లోనైఉంటున్నాడు. కనుకనే దుఃఖమునకు గురి అవుతున్నాడు. ''దురాశ దుఃఖమునకు చేటు'' అన్నారు. కనుక ఈ నాడు విద్యను అభ్యసించడము అపవిత్రమైన దురాశను పెంచుకోవడమే జరుగుచున్నది. "ఏ డిగ్రీ తీసుకుంటే ఏ విధమైన ఉన్నతస్థాయిని నేను పొందగలను? ఏ పి. హెచ్ డి. తీసుకుంటే ఎంతవరకు నేను ''శాలరీ'' (salary) ని పెంచుకోగలను? ఏ విధమైన ఉద్యోగము చిక్కితే దానినుంచి సరియైన స్థానమును పొందగలను?'' అనే తన స్వార్థమును అభివృద్ధి పరచుకుంటూ, కేవలము కాకి కంటెహీనంగా జీవించడానికి ప్రయత్నిస్తున్నాడు విద్యావంతుడు.

విద్యావంతుడు, సమాజమునుంచి ఏమిలాగాలి? ఏమి తస్కరించాలి ? అనే స్వార్థముతోనే జీవిస్తున్నాడు. కానీ, తాను సమాజమునకెట్లు తోడ్పడుచున్నానను భావము శూన్యము; పుచ్చుకునే భావమునందే తాను ' హీరో 'గా ఉంటున్నాడు. పల్లెలయందు జీవించే విద్యార్థులు సహితము, ఆస్తిపాస్తులు తమ కందించు అమ్మానాన్నల కంటినీరు వింపి, అనేకఅవస్థలకు

గురిచేసి, ఏదో డిగ్రీఅనే భిక్షాపాత్రను తీసుకుని పట్టణమునకు, చేరి అనేకవిధములైన దురవస్థలకు గురియై పోతున్నారు. ఇది సరియైన విద్యాలక్షణము కాదు. పల్లె విద్యార్థులు తాము ఉన్నతవిద్యను గడపి. పల్లెయందే జీవిస్తూ, పల్లెవారికి తగిన సహకారాన్నందిస్తూ, ఆ పల్లెయొక్క అభివృద్ధికి తగిన కృషి సలుపాలి. అనైక్యత, అసభ్యాత్వాన్ని అభివృద్ధి గావిస్తుంటుంది. ఐక్యతాసభ్యములు దేశమునకెంతో మంచిని చేస్తూ వస్తున్నవి.

సమత్వాన్ని అభివృద్ధిపరచుకునే స్థితియందు విద్యార్థులు కొంత ముందంజ వేయాలి. అయితే బయట ప్రపంచమునందు అశాంతులు అభివృద్ధికావడము, అసంతృప్తికి గురికావడము, అసభ్యమైన ప్రవర్తనలు జరగడము కొల్లలుగా జరుగుతున్నాయి. ఇట్టి దురవస్థలు, దుర్బుద్ధులు, దుర్భావములు లేకుండా చేసేనిమిత్తమై సత్యసాయికళాశాల స్థాపించడం జరిగింది. కనుక సత్యసాయికళాశాలయందు ఉత్తీర్ణులయినటువంటి విద్యార్థులు ఉన్నతవిద్యనభ్యసించి, అనేకవిధములైన రంగములందు సత్యసాయి ఆశయాలను, పవిత్రమైన భావాలను ప్రచారముచేయవలెనని, నిస్వార్థమైన సేవలను ఆచరించుటకై బయట ప్రపంచమునందు ప్రవేశించాలని సత్యసాయియొక్క అనంతమైన ఆశ. స్థలములుమారినా, లోకములుమారినా, సత్యసాయి ఆశయాలు మాత్రము మారకుండా ఉండే నిమిత్తమై మీరు తగిన శ్రమపడాలనికూడ నా ఆశ. సత్యసాయి కళాశాల విద్యార్థులు అన్నిరంగములయందు ప్రవేశించాలి. నైతిక, భౌతిక, ధార్మిక, ఆధ్యాత్మిక రాజకీయ, లౌకిక, విజ్ఞాన, రంగములయందునూ మన విద్యార్థులు ప్రవేశించాలి. రంగములు మార్చవచ్చునుగానీ రంగులు మార్చకూడదని నా ఇష్టం.

బృందావనమందు ఉండినంతవరకూ, వీరి స్వభావములు, వీరి ప్రవర్తనలు, వీరి వేషభాషలు వేరుగ ఉంటాయి. బృందావనం వదలగనే వీరి ఆహారవిహరములు, వేషభాషలు, విరుద్ధమైన రీతిగా నుండును. ఈవిధమైన దౌర్బల్యముకలిగిన హృదయాలు ఎక్కడ ఉండినప్పటికినీ. సార్థకం ఉండదు. దౌర్బల్యహృదయుడు జగత్తునకు ఏవిధమైన ఉపకారము చేయలేడు. కేవలము మృగమువలె తన పొట్టను తాను నింపుకొనేనిమిత్తమై ప్రాకులాడుట తప్ప జగత్తునకు ఉపకారము చేసే విశాలమైన భావములు వీరిలో అభివృద్ధిగాంచవు. బలహీనుడే అనుకరణకు ప్రయత్నిస్తాడు. ఈ 'ఇమిటేషన్' కేవలం దౌర్బల్యమైన హృదయం గలవారుమాత్రమే చేయగలరు. నీసత్యాన్ని నీవు విస్మరించక, నీహృదయాన్ని నీవు నమ్మక, నీకన్నులతో నీవు చూడక ఇతరుల కన్నులతో నీవెందుకు చూడటం? ఇతరుల హృదయంతో నీవెందుకు ఆలోచన చేయడం? 5 సంవత్సరములు, 7 సంవత్సరములు, 9 సంవత్సరములు బృందావనమునందు జీవించి, ఏ తల్లికూడనూ ప్రేమించలేనంత వెయ్యి తల్లుల ప్రేమను నీవు అనుభవించి, కేవలము బయట ప్రదేశములకుపోయి కేవలము ఇతరులను అనుసరించడము, అనుకరించడముననెడి దౌర్బల్యమార్గానికి గురి అవుతే నీవు విద్యార్థి ఏరీతిగా కాగలవు? "తల్లి ముక్కు కోసినటువంటివానికి మేనత్తముక్కు బెండపూవువంటిది" అన్నారు. వెయ్యితల్లులప్రేమను, అందించే సాయి ఆశయాలకే నీవు విరుద్ధంగా నడిచిన ఇక నిజమైన నీతల్లిదండ్రుల ఆశయాలుగానీ, లేక నీకు అమితమిత్రులైనవారి ఆశయాలుకానీ, ఎంతకాలము పాటించగలవు? దైవద్రోహానికే గురిఅయిన వ్యక్తి, సర్వసామాన్యమైన మానవునికి ఎంతద్రోహం చేయగలడు? కనుక ఈ విషయాలను పాతవిద్యార్థులు హృదయము

నందు అభివృద్ధిగావించుకుని, మునుముందైనా ఉత్తమమైన భావములు, పవిత్రమైన చిత్తములు, నిస్వార్థమైన కర్మలను ఆచరించి సార్థకమైన పేరును ఈ సత్యసాయి కాలేజికి తేగలరని నేను ఆశిస్తున్నాను.

విద్యార్థి సమాజమునకు హృదయమువంటివాడు. ఈ సమాజమునకే హింసకావించే విద్యార్థి, ఈ సమాజమునకే ద్రోహి. సత్యసాయి విద్యార్థులు ఏప్రదేశమునకు వెళ్ళినప్పటికినీ, ఏస్థానమునందున్నప్పటికినీ ఏదేశమునకు పోయినప్పటికినీ, తన వినయవిధేయతలు అభ్యాసములు వేషభాషలనుచూచి "నీవు సత్యసాయి కాలేజీ స్టూడెంటువా!" అని ప్రవర్తననుగల్గి ఉండాలి. అట్లుకాకుండా వేషభాషలయందు మార్పు చేసుకుని సైబన్స్, లాంగ్ హైర్స్, పెద్ద పెద్ద మీసాలు హిప్పీలలాగా తయారయి ఎవరిదగ్గరికిపోయి 'నేను సత్యసాయి కాలేజీ స్టూడెంటుని' అని చెప్పినా 'ఛీ ఛీఛీ'! నీవు సత్యసాయి కళాశాల విద్యార్థివికాదని నీవేషమే తెల్పుతుంది, అని అంటారు. నీవు నిజమైన విద్యావంతుడవు, శూరుడవు, సేవకుడవుగానై సత్యసాయికళాశాల ఆశయాలను అందించుటకు 'హంబుల్'గా ప్రవర్తించాలి. నిరహంకారంగా ఉండాలి. కనుక చదువు సమస్యలు ఈవిధప్రవర్తనలనిరూపిస్తూ ఉంటాయి.

సత్యసాయికాలేజీ విద్యార్థులు పైజెప్పిన మార్గమునందు ఇంకా ప్రవేశించకుండానే నేను ముమ్మందు వారిని హెచ్చరించేనిమిత్తమై నేనింతగాఢంగా చెప్పవలసి వచ్చింది. మదనమోహనమాలవ్యా రాజకీయ నాయకుడు, మహాతత్త్వవేత్త, విజ్ఞానవేత్త. అతను పెద్ద పెద్ద మీసములు కలిగిఉండేవాడు. ఒకనాడు తెల్లవారేసరికి బాగా షేవ్ చేసుకొని ఒక క్లబ్బులోగల తన స్నేహితుడి దగ్గరకెళ్ళాడు. అప్పుడు ఆస్నేహితుడు ప్రశ్నించాడు, "మాలవ్యా! ఏమి ఈనాడు నీముఖవర్చస్సు కొంతవిరుద్ధంగా కనిపిస్తున్నది"! "ఆవిరుద్ధమేమిటో నీవే చెప్పుమని", మాలవ్య ప్రశ్నించాడు. నీముఖమునందు ఏదోకొంతమార్పు కలిగింది, నీకున్న పెద్దమీసములు ఎందుకు కొరిగించావు అన్నాడు. "మగవాడను అనే అహంకారముచేత నేను ఇంతకాలమూ మీసములు పెంచాను. కానీ, ఈ భారతదేశమునందు తోడి మానవులు చాల మంది అనేక అవస్థలకు, అనేకదుఃఖములకు, గురి అవుతున్నారు. ఒక్క మానవుని దుఃఖమైనా తీర్చలేని మగతనము నాకెందుకని" కొరిగించుకున్నాను అన్నాడు. కనుక మనము నిజముగా వీరులమైతే సైబన్స్ పెంచడము మీసములు పెంచడము, అనవసరమైన వేషాలు వేయడము ఇది కాదు, మానవత్వానికి గుర్తు. సమాజములో దుమికి, సేవలు చేసి జగత్తునకు సరియైన కీర్తిని తెప్పించే ప్రయత్నమునకు మన విద్యను అంకితం గావించాలి. తల్లిదండ్రుల బాధలన్నీ నివారణగావించలేని నీమగతనము, తోడి మానవుల బాధలు నివారణగావించలేని నీమగతనము, కేవలము హాస్యాస్పదము. కాన మన విద్యాతత్త్వప్రవర్తనద్వారా మన మానవత్వాన్ని, మన మగతత్త్వాన్ని నిరూపించు మార్గములో మనం ప్రవేశించాలి. సత్యసాయి పవిత్రమైన ఆశయాలను ప్రవర్తనరూపకంగా ప్రచారము సలిపి ఆచరణరూపమైన అనుభూతిలోపల సంచారం సలపాలి.

విద్యార్థులారా! మీరు ఉన్నతమైన డిగ్రీలు సంపాదించి, మీతల్లిదండ్రులను సంతోషపెట్టి, ఏ ప్రదేశమునందైనను ఉద్యోగం చేసుకుని మీరు సుఖశాంతమైన జీవితం గడుపుతూ ఆదర్శవంతమైన భావాలను సమాజమునకు అందించే కంకణం కట్టుకోండి, ధనమును సంపాదించే దుర్భావము చేత మీరు ఉద్యోగం చేయ

కంది. గుణమును పోషించుకునే ఉద్దేశంతో మీరు ఉద్యోగం చేయండి. ఏ ఆఫీసుకుపోయినా ఫరవాలేదు. ఏ ఉద్యోగం చేసినా తప్పులేదు. కానీ, ఆ ఆఫీసుల యందు, ఆ ఉద్యోగములయందు దోషములు కలుగకుండా, ఉండుటకై మీరు అతిజాగ్రత్తగా మెలగాలి. మీకుతెలుసు, "Money comes and goes. Morality comes and grows" అని ధనసంపాదన గొప్పది కాదు. ఎంతమంది జగత్తులో అన్యాయ, అక్రమ, అనాచార, అసత్యములతో ధన సంపాదన చేయడంలేదు? కడచిన సంవత్సరము బొంబాయిలో ఒక 'బెగ్గర్' కూడా 'బెగ్' చేసి రూ.60,000లు కుండలో క్రిందపెట్టుకుని పడుకున్నాడు. కనుక భిక్షాధికారికూడా ధనసంపాదనకు ప్రయత్నం చేస్తున్నాడు. నీవు ధనమే ప్రధానమైన లక్ష్యంగా పెట్టుకుంటే నీవు చదువుకున్న భిక్షగాడివే। కనుక మీరు ధనలక్ష్యంతో చదువును ఆశించడము కేవలము 'బెగ్గర్' లక్షణమనే భావించవచ్చు. దేశోద్ధార నిమిత్తమై సమాజపవిత్రతనిమిత్తమై. దేశాభివృద్ధినిమిత్తమై నీవు విద్యను ఆశించాలి.

(సశేషము)

## పు స్త క ము లు

| | పేరు | వెల | తపాల ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుతమూర్తి_(హవార్డ్ మర్ఫెట్ ఆంధ్రానువాదం_అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | ఆత్మారామం | 5-00 | 0-45 |
| 3. | ఆధ్యాత్మికదీపిక | 2-50 | 0-20 |
| 4. | గీతావాహిని | 3-50 | 0-25 |
| 5. | జ్ఞానవాహిని | 1-00 | 0-10 |
| 6. | ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 7. | ప్రేమవాహిని | 1-00 | 0-15 |
| 8. | భాగవతవాహిని | 3-00 | 0-25 |
| 9. | భజనావళి | 2-00 | 0-20 |
| 10. | మణిమాల | 2-00 | 0-20 |
| 11. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-35 |
| 12. | సత్యం శివం సుందరం(3) | 5-00 | 0-35 |
| 13. | సందేహనివారిణి | 2-00 | 0-20 |
| 14. | సూక్తిరసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 15. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-35 |
| 16. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 17. | సువర్ణసుమమాల | 5-00 | 0-30 |
| 18. | శ్రీ సత్యసాయి వచనామృతము (1) | 3-00 | 0-35 |
| 19. | శ్రీ సత్యసాయిదివ్యబోధ | 2-00 | 0-20 |
| 20. | శ్రీ సత్యసాయివచనామృతము3) | 2-00 | 0-20 |

కర్ణాటక రాజ్యపు బెంగుళూరు_67, బృందావనములోని వ్రజ్ బృందావన్ ప్రెస్ నందు పి. చంగ్కకోటిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే. "శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్. శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్" ప్రశాంతి నిలయం, తరపున ప్రచురింపబడినది. ఎడిటర్ : యన్. కస్తూరి. యం. యే., బి. యల్.

# STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS ABOUT NEWSPAPER

SANATHANA SARATHI (**Telugu Edition**)

FORM IV (See Rule 8)

| | | |
|---|---|---|
| 1. Place of publication | : | Prasanthi Nilayam. 515 134<br>Anantapur Dist. A.P. |
| 2. Periodicity of publication | : | Monthly. |
| 3. Printer's Name<br>(whether citizen of India)<br>Address | : | P. Changkakoti<br>Indian<br>'Brindavan' Kadugodi Post,<br>Bangalore 560 067. |
| 4. Publisher's Name<br>(whether citizen of India)<br>Address | | N. Kasturi, M.A., B.L.,<br>Indian<br>Prasanthi Nilayam Post. 515 134<br>Anantapur Dist. A.P., S. INDIA. |
| 5. Editor's Name<br>(whether citizen of India)<br>Address | : | N. Kasturi, M.A., B.L.,<br>Indian<br>Prasanthi Nilayam Post, 515 134<br>Anantapur Dist. A.P., S. India. |
| 6. Name and address of individuals who own the newspaper or share-holders holding more than one percent of the total Capital. | : | Sri Sathya Sai Books and Publications,<br>Sri Sathya Sai Central Trust,<br>Prasanthi Nilayam Post, 515 134.<br>Anantapur Dist. A.P., S. India. |

I, N. Kasturi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*Date 1—3—1980.*

N. KASTURI,

*Signature of Publisher.*

# శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్, ప్రశాంతినిలయం,

పత్రికలు — పుస్తకములకు ఆర్డర్లు.

A (1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువకానీ చందాలు స్వీకరింపబడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 5 .రూ |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘనిస్థాన్ | 16 | 26 | | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | | 18 | | 18 |
| అమెరికా | 16 | 51 | | 20 | | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | | 14 | | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | | 20 | | 20 |
| బర్మా | 16 | 26 | | 12 | | 12 |
| యూరప్ ఖండపు దేశములు | 16 | 46 | | 18 | | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | | 20 | | 20 |
| శ్రీలంక | 8 | 21 | | 10 | | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏభాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలయును. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రస్సు నందు మార్పు అవసరమని తెలుపు సమయమునందును చందా నంబరును వ్రాసి పంపవలయును.

B (1) పుస్తకములు : ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన రిజిస్టర్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డరుతో పంపవలసియున్నది. V.P.P. ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డరులోనే తెలుపవలయును

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయమునుంచి వివరములు తెలుసుకొనవలెనన్న మీ చిరునామాగల స్టాంపు వేసిన కవరును పంపవలయును.

(5) పుస్తకముల ఆర్డరులు—విదేశములనుంచి తపాల ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, ప్రశాంతినిలయం, అనంతపురం జిల్లా ఆంధ్ర ప్రదేశ్-పిన్:515134, యొక్క చిరునామాకే పంపవలయును. మనియార్డర్ పంపువారు వెనుకభాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలయును.

(పుస్తకసూచి 71 వ పుటలో చూడండి)

Regd. No. KRNU—83 MARCH 1980

మానవుడు కండబలం, గుండెబలం చూచుకొని జీవిస్తున్నాడే కానీ దైవబలమును ఆశించుటకు ప్రయత్నించుట లేదు. అగ్నికి కొంతదూరముగా ఉన్నప్పుడు భయపడుతున్న వ్యక్తి అగ్ని దగ్గరగా వచ్చినప్పుడు భయపడకుండుట విపరీతబుద్ధి. మానవునియందు కొన్ని రకముల అగ్నులు ఆరక ఎప్పుడూఉంటాయి. మానవుని దేహమందు, హృదయములో కామాగ్ని, క్రోధాగ్ని, మోహాగ్ని, లోభాగ్నిచేరి దేహమనే గృహం ఏ విధముగా క్షీణించి బొగ్గులుగా మారుతుందో మరచి అనేకరకములైన పనులు చేస్తుంటాడు. సర్పము ఇంటిలోచేరినప్పుడు ఆ సర్పాన్ని పట్టియో కొట్టియో పారవేయువరకు ఆ యింటిలోఉండుటకు భయపడతాడు. కాని తన దేహమనే యింటిలో విషయమనే విషసర్పము చేరి అనేక పుట్టలు పెట్టి అభివృద్ధిపరచుకొంటుండగా తాను చాల ధైర్యముగా ఉండుట ఆశ్చర్యకరమైన విషయము.

బాబా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64